# బ్రతుకు భయం

కొడవటిగంటి కుటుంబరావు

నవోదయ పబ్లిషర్స్
ఏలూరు రోడ్ విజయవాడ2

# కుటుంబరావుగారి 'సీతప్ప'

ఆనాడు పార్వతీదేవి ఒక్క పిండిముద్దతో వినాయకుణ్ణి సృష్టించినట్లు, ఒక్క పిరికి ముద్దతో సీతప్పను సృష్టించారు కుటుంబరావుగారు.

కొందరు వ్యక్తులు యితర్ల మెప్పుకోసమో, దయాదాక్షిణ్యాలకోసమో ఎదురు చూడకుండా మేఘాలపైన నిర్మలాకాశంలో వెళ్ళే పెద్ద విమానాల్లాగా ముక్కుకు సూటిగా పోతూంటారు.

కొందరు ఎక్కువ పైకి వెళ్ళలేని చిన్న విమానాలు, మేఘాల్లో చిక్కుకుని ఉక్కిరిబిక్కిరైనట్లు అనుక్షణం రంగులుమారే ఈ ప్రపంచానికి భయపడి, పిరికితనానికి లౌక్యం అనే బురఖా తగిలించుకుని, ఏ ఎండ కా గొడుగు పడుతూ ఆత్మవంచన చేసుకోడం లోనే తృప్తికోసం దేవుళ్ళాడుతారు.

ఈ రెండవ రకానికి చెందినవాడే సీతప్ప. పిరికిలోనూ రెండురకాలున్నాయి. గుడ్డపీలికను చూసి పాము అనుకుని భ్రమించి భయపడేవాళ్ళు కొందరు. సీతప్ప ఆ రకానికి చెందడు. అసలు పామును చూసి అది గుడ్డ

పేలిక అనుకుంటాడు సీతప్ప...అది పామే అని నమ్మే ధైర్యమూ,దాన్ని చంపే సాహసమూ సీతప్పకు ఎప్పుడూ లేవు. అది గుడ్డపీలికేనని తనకు తాను నచ్చచెప్పుకోడానికి ప్రియాసపడి ప్రియత్నిస్తాడు.

చీకట్లో ఏ సహాయం లేకుండా కండ్లు మూసుకుని నడిచి వెళ్ళగలడు సీతప్ప... కాని వెల్తుర్లో వెళ్ళడానికి ఖంగారుపడతాడు.

చీకట్లో తను వెళ్ళేదేదారి, వెల్తుర్లో అనేకదార్లూ, మిట్టపల్లాలూ కనిపిస్తాయి. ఎటుపోవాలో, ఎలా పోవాలో తెలీక ఆ శ్రీరామచంద్రుణ్ణి కేకేస్తాడు–వెల్తుర్లోంచి దాటించమని !

గంతకుతగిన బొంత సీతప్ప భార్య... అరుంధతి కాలంనాటి అమాయకురాలు. యిదేం అన్యాయమండీ అంటూ భర్తతో పోట్లాడి దార్లోకి తేగలిగే గడసరి భార్య అయినా సీతప్పలో కొంత మార్పు కలిగేది. కనీసం మా అత్తగారిలాంటి అప్పచెల్లెళ్ళున్నా సీతప్ప మరీ యింత నాసిగా తయారయ్యేవాడు కాదు. మా అత్తగారి దృష్టిలో సీతప్ప ఒక్క నాసిమాత్రిమే కాదు పిరికి సన్నాసికూడా...

మా అత్తగారూ, సీతప్పా, ఉత్తర

ధృవం, దక్షిణధృవం. వీళ్ళిద్దరూ ఏ విషయం లోనూ ఏకీభవించరు. సీతప్పే మా అత్త గారికి ఎదురైతే ముఖం వాచేటట్టు చీవాట్లు తింటాడు. "అసలా శ్రీరామచంద్రుణ్ణి నమ్ముకుని ఎవరు సుఖపడ్డారా్రి సీతప్పా! ఆయనపడ్డ కష్టాలన్నీ నమ్ముకున్న వాళ్ళనే పెడతాడ్రా! నామాట విని ఆ వెంకన్నని వేడుకోరా ... గట్టెక్కుతావు" అంటారు మా అత్తగారు.

శ్రీరామచంద్రుణ్ణి ఆవిధంగా మా అత్తగారు తూలనాడడం సీతప్ప మనసు చివుక్కుమనిపించినా పైకి నవ్వుముఖం తోనూ, అతివినయ విధేయతలతోనూ పులి ముందు మేకలాగా చేతులు నలుపుకుంటూ "ఆఁ... అంతే... అంతే... చక్కగా చెప్పా రక్కగారు. గట్టెక్కడానికేం ... ఏటా కొండెక్కుతూనే వున్నాం. అయినా ఆ శ్రీరామచంద్రుడెవరూ! యీ వెంకన్నెవరూ! ఇద్దరూ ఒక్కరేగా! అవతార భేదం. అంతే...ప్చ్—వాడే వీడు, వీడే వాడు. అజ్ఞానంలో వేరే వేరే అనుకుంటాం గానీ, అపచారం ... అపచారం" నేల చూపులు చూస్తూ మెల్లిగా లెంపలేసు కున్నాడు, మా అత్తగార్ని సూటిగా చూసి మాట్లాడే ధైర్యంలేని సీతప్ప.

"అపచారం కాదురా ! ఇక్కడే నీ గ్రహచారం బాగులేదు. వాడూ వీడూ యిద్దరూ ఒకటెట్లా అవుతారా ? నువ్వూ, నేనూ ఒకటవుతామూ చెప్పూ ! నీ స్వభావం వేరు, నా స్వభావం వేరు. అసలు అవతారభేదం రాముడికీ, కృష్ణుడికీ రా... వెంకన్న కేవలం కలియుగ నారాయణుడు. వీళ్ళందరికంటే పైవాడురా, పైవాడు. వెర్రివాడా నీకేం తెలుసు వెంకన్న మహిమ. "అవునవును. తప్పకుండా పైవాడే, పైవాడే. అదిసరేగానీ నీ కొడుకింకా అత్తారింట్లోనే వున్నాడా లేక..."

ఉలిక్కిపడ్డాడు సీతప్ప.

"ఆఁ మీ దయవల్ల ఆ శ్రీరామచంద్రుడి... (నాలుక్కొరుక్కున్నాడు సీతప్ప) అదే అదే ఆ వెంకన్న దయవల్ల అత్తగారింట్లోనే హాయిగా వుంటున్నాడు. వాళ్ళు తమ సొంత కొడుకుతో బాటు మావాణ్ణి ఎంతో బాగా చూసుకుంటారు"

ఈ మాటలంటున్న సీతప్పను చూస్తే మా అత్తగారికి వళ్ళు మండకుండా వుంటుందా... ! మండింది.

"ఆపరా ! నీ లొట్టోపాఖ్యానం. అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గిరా ! అసలు నీ

కొడుకు అత్తగారింట్లో అడ్డమైన చాకిరీ చేసిన సంగతి ఎవరికి తెలియదనీ! కొత్తగా ఏదో నాకు చెప్పొచ్చావ్! గడ్డిపోచకంటే కనాకష్టంగా చూశావతన్ని పెళ్ళాంతో సహా! అయినా కళ్ళు మూసుకుని పాలు తాగే పిల్లివిరా సీతప్పా నువ్వు" మా అత్త గారి ఆవేశ ధోరణికి సీతప్పకు ఒళ్ళంతా ఒణకడం మొదలెట్టింది.

"అహా... అహా... అబ్బే ... కేవలం అట్లాని అనుకోకూడదనుకోండి మనం. అసలు యివన్నీ కొన్ని చెప్పాదుమాటలూ, కొన్ని గిట్టనిమాటలూ"

"ఒరేయ్ సీతప్పా! లాభంలేదురా, నీవల్లనే నీ కూతురు కాపరం, నీ కొడుకు కాపరం గూడా చెడ్డాయి. ఇదుగో, నేనొకటి చెప్తా విను. ఇంతకాలం నీవు భయపడి నీ కొడుకు అత్తవారింట్లో చవటలా పడున్నది చాలు. తక్షణం వాణ్ణి పిలిపించుకో. వెన కాలే గడియలమీద నీ కోడలొస్తుంది. రాదూ! విడాకులిప్పిస్తానని బెదిరించు. నీ కొడుక్కేంరా... నిక్షేపంలా చదివాడు. దాని తాతలాంటి పెళ్ళాం వస్తుంది. నే చేస్తారా నీ కొడుక్కు రెండో పెళ్ళి" ఆ మాటలు వింటున్న సీతప్ప నిలువెల్లా కంపించి

పోయాడు. ముచ్చెమటలుపోసి మాటలు తడబడ్డాయి.

"బ్బె... బ్బె... బ్బె... ఎందుకూ ... ఎందుకూ మనం...మనం...మరీ...మరీ... అంత...అంత దూరం వెళ్ళద్దు. వాళ్ళు మొగుడూ పెళ్ళాం యిద్దరూ ఖు...ఖులాసా గానే వుంటున్నారు. మొన్ననే ఆడపిల్ల కూడా పుట్టింది" తత్తరపాటులోనే ఆనం దంతో కూడిన సీతప్ప నవ్వు.

"ఆ పుట్టింది దుష్టనక్షత్రంలో. శాంతి ఖర్చుకూడా నీ నెత్తికెత్తి వస్తేరా లేకపోతే చస్తావని బెదిరించడం ఎవరికి తెలీదురా! ఆ నాస్తికుల కొంపకు నువ్వు గాబట్టి వెళ్లావు. "అదే, అదే...మరి...వెళ్లాలిగా! ఆ నక్షత్రం నాకు గండం అన్నారామె. పైగా దానికితోడు అష్టగ్రహాలూ ప్రపం చాన్ని నీళ్ళల్లో ముంచేస్తా యన్నారామె. యీావూరే నీళ్ళల్లో..."

"ఆఁ ! నీళ్ళల్లో ముంచకపోయినా అష్ట గ్రహాలూ నిన్ను కష్టాల్లో ముంచి వున్న ఉద్యోగంకాస్తా ఊడబీక్కెళ్లాయి. రోజూ కాళ్ళరిగేట్టు ఈ వయసులో ఉద్యోగంకోసం తిరుగుతున్నావు వూరంతా. మన పక్క వీధిలోవున్న టి. టి. ఫేక్టరీలో ఏదో ఉద్యో

గం వుందని విన్నాను. అబ్బాయితో చెప్పి ఆ ఉద్యోగం నీ కిప్పించేట్టు చూస్తాను. పెద్ద తనంలో అక్కడా యిక్కడా తిరక్క ఆ ఫేక్టరీలో చేరు. ఆ మేనేజరుకూడా నీలాంటి వాడేనట్లే"

"ఆఁ !" భయంతో నోరు తెరిచి కొయ్యబారిపోయాడు సీతప్ప.

"ఏమన్నారు ! టి. టి. ఫేక్టరీలోనా ! ఆ ఫేక్టరీ వాళ్ళంతా పచ్చి రౌడీమూక టి. టి. ఫేక్టరీ అంటే 'తన్నులు తినే ఫేక్టరీ' అంటారు అంతా. మొన్ననే ఆ ఫేక్టరీ వాళ్ళంతా సమ్మెజేసి మేనేజర్ని తన్నారని విన్నాను"

"అవును...తంతారా్రి...తన్నకేంజేస్తారు... నీలాంటి చచ్చూ, పుచ్చూ వుంటే ! ఆ తన్నుల్లోనే అక్కడ నీ కొడుకు కండ్లు తెరిచాడని విన్నాను. అందుకే నిన్ను గూడా ఈ ఫేక్టరీలో చేరమంటున్నాను. మనిషికో మాట, గొడ్డుకో దెబ్బ అన్నారు. మీా విషయాలో తలకిందులైంది. ఏమంటావ్ ఆ ఫేక్టరీ ఉద్యోగం"

సీతప్ప భయంతో కంపించాడు.

"అహహా... అబ్బెబ్బె... ఎందుకూ శ్రీ రామాలయంలో అకౌంట్లురాసే చిన్న

పనేదో వుందన్నారు. అక్కడికే వెళ్తూ యిటొచ్చా. అది చాలు. ఈ పెద్దతనంలో ఒళ్ళు హూణం చేసుకోడం దేనికి! మళ్ళీ కనిపిస్తా" సీతప్ప చెప్పులు తొడుక్కుని అష్ట గ్రహాలు తరిమిన దానికంటే ఎక్కువ ఖంగారుతో రోడ్డుమీది కెళ్ళడం చూసిన మా అత్తగారు పెదవి విరిచి చప్పరించారు.

"అబ్బే వీడు ఒట్ఠి నాప...వీణ్ణి బాగు చేయడం ఆ వెంకన్నవల్ల గూడాకాదు. ఆ రామాలయంలో అక్కౌంట్లు రాసి ఒక్కడు బాగుపళ్లా. ప్చ...అసలు బ్రహ్మ వీణ్ణెం దుకు సృష్టించాడో నా కర్థంగాదు" అని గొణుక్కున్నారు మా. అత్తగారు.

అసలు మా అత్తగార్నీ, సీతప్పనూ బ్రహ్మ సృష్టిస్తేగా! బ్రహ్మ సృష్టిలో మార్పుంది. కాని సీతప్పా, మా అత్తగారూ మారరు. వీళ్ళిద్దర్లో మార్పు తేవడం ఆ బ్రహ్మతరంకూడా కాదు. అలాంటి మార్పు లేని, మరపురాని సీతప్ప. పాత్రను సృష్టిం చిన కుటుంబరావుగారు అభినందనీయులు.

మద్రాసు
14-1-64

# నా మాట

'బెదిరిన మనుషులు'తో సీతప్పకు ఉద్వాసన అయిందనుకున్నాను. కాని శ్రీ ఐ.సి.హెచ్.వి. బసవరాజుగారు టి. వి. శంకరాన్ని (నన్ను కూడా) రెచ్చగొట్టి, సీతప్పని మళ్ళా వీధిలోకి ఈడ్చారు. వారి పుణ్యమా (లేక పాపమా) అంటూ ఈ 'బ్రతుకుభయం' తయారయింది. ఇది 'బెదిరిన మనుషులు'కు సీక్వెల్ అన్నమాట.

తెలుగు సాహిత్యం చదివే వారిలో ఒక అల్ప సంఖ్యాక వర్గానికి మాత్రమే సీతప్ప పాత్ర బాగా పట్టింది. నా మటుకునాకు సీతప్ప పాత్ర మొదట్లో ఒకవిధమైన కారికేచర్‌లాగా కనిపించేది; 'కాదు అది సజీవపాత్రే' అని నాకన్న తెలివైన మిత్రులు చెప్పినప్పుడు నేను వారిమాట నమ్మలేదు. కాని రానురాను సీతప్ప నాకళ్ళకూ కూడా వాస్తవవ్యక్తిలాగా కనపడసాగాడు. 'మనమంతా సీతప్ప లమేనేమో!' అనిపించటం మొదలు

పెట్టింది. 'బ్రతుకుభయం' పూర్తి అయేలోపల సీతప్ప నా పాలిటికి రాక్షసుడై కూర్చున్నాడు. భయపడిన మనిషిగా ఆరంభమైన సీతప్ప నన్ను భయపెట్టే మనిషిగా తయారయాడు. నాకిప్పుడు సీతప్పనుచూస్తే పెద్దభయం. ఇంక ఆ పాత్రజోలికి పోనని ఒట్టేసుకున్నాను కూడా.

'బ్రతుకుభయం' లోని ప్రకరణాలు విడి కథలుగా 'యువ' మాసపత్రికలో ఇంచుమించు వరసగా ప్రకటించబడ్డాయి. అప్పుడవి యువ పాఠకులనుగొప్పగాఆకర్షించాయనటానికి ఆధారమేమీకనిపించలేదు.ఒకేఒకపాఠకుడు 'అవటాని'ఏప్రాంతాల వాళ్ళు అంటారు చెప్మా అన్న సందేహం వెలిబుచ్చారు. అంతవరకైనా 'బ్రతుకుభయం' పాఠకుల ఆలోచనను రెచ్చగొట్టిందని ఒప్పుకోవాలి.

నాకు చాలా కాలంగా ఒక్క విషయంలో కుతూహలం ఉండేది. మనవాడు సీతప్పా, భానుమతి అత్తగారూ తటస్థపడితే ఏమౌతుంది? సీతప్ప

బెదురుగొడ్డు; అత్తగారు నదురూ బెదురూ లేనిది; భారత అధ్యక్షుని భోజనానికి పిలిచి అరటికాయ పొడి వడ్డించెయ్యగల మనిషి. ఈరెండు పాత్రలూ జతపడితే ఏంజరుగుతుందో ఊహించటం నావల్ల కాలేదు. ఆమెపుణ్యమా అంటూ శ్రీమతి భానుమతీ రామకృష్ణగారు నా కుతూహలాన్ని తీర్చారు. ఆమెకు నేనెంతైనా కృతజ్ఞుణ్ణి.

'బెదిరిన మనుషులు' కూ 'బ్రతుకు భయం' కూ టైటిలు బొమ్మలువేసిన చిత్రకారుడు బాపు గారికీ, ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్న నవోదయ సంస్థకూకూడా నేను కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

మద్రాసు
23-10-64 } కొడవటిగంటి కుటుంబరావు.

# బ్రతుకు భయం

'ఎలాగో వీలుజూసుకుని ఆఫీసునుంచి పెందరాళే వచ్చేస్తాను. నువుమాత్రం రెడీగా వున్నావట్టాయినా యికా యెకీని నగల షాపు కెళ్ళి, కొనవలసిన కమ్మలేవో కొని ఇంటికి చక్కావద్దాం; నువు కోరిన ప్రకారమే కొత్త కమ్మలు పెట్టుకుని కోడలు సీమంతాని కెళుదూగాని, సరా' అవటాని సీతప్ప ఆఫీసు కెళ్ళేప్పుడు మాట యిచ్చి మరీ వెళ్ళాడు.

అంచేత రావమ్మగారు రోజల్లా మేఘాల్లో విహరించడమే గాకుండా, మూడింటికల్లా నగలషాపుకు వెళ్ళడానికి అనువైన ముస్తాబులో తయారై భర్తరాకకోసం ఎదురు చూస్తూంది.

అంతలోనే పోస్టువాడు ఒక కార్డిచ్చి వెళ్లాడు. సత్యం రాశాడు. రావమ్మగారు అక్షరాలు కూడబలుక్కుంటూ కార్డంతా చదువుకుంది.

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన నాన్నగారికి కృతానేక నమస్కారములు. మీ కుమారుడు సత్యనారాయణ వ్రాయునది. త॥ ఇక్కడ అంతా క్షేమం. మీ క్షేమం తరుచు వ్రాయించ

గోరుతాను. సీతారత్నంకు ఆరోగ్యం ఏమియు బాగుండ లేదు. మా శావమరిది నరుసుకు కాళ్ళు పట్టుకుపోయ్యాయి. నాకు మూడురోజులుగా రక్తవిరేచనములు. గడచిన రాత్రి మన యింట్లో దొంగలు పడినట్టు కల వచ్చినది. చాలా భయపడిపోయి నిద్రలేచినాను. అమ్మ క్రొత్త కమ్మలు కొంటున్నట్టు సోవక్కయ్య చెప్పినది. అక్కగారింట్లో అంతా క్షేమం. మీరు ఎప్పుడు బయలుదేరి వస్తారా అని వేయి కన్నులతో ఎదురు చూచుచున్నాను. అమ్మకు నా నమస్కారములు చెప్పవలెను. మీ క్షేమము తరుచు వ్రాయించు చుండవలెను." ఇట్లు, సత్యనారాయణ.

రావమ్మ ఉత్తరం పూర్తిగా చదువుకుని, తనలో తాను ప్రేమతో నవ్వుకుంటూ, "పిచ్చి కొర్నాసి!" అను కున్నది. ఉత్తరంలో సత్యం తన కమ్మలుగురించి రాసిన ముక్క తప్ప ఆవిడ కింకేమీ తలకెక్కలేదు.

"ఇదీ ఒక శకునమే!" అనుకున్నదామె. అయే పన్లకి అనేక దాఖలాలు కనబడతాయి. అది రావమ్మ అనుభవం. అలాంటి దాఖలాలు కనబడవో, మనం విశ్వప్రయత్నం చెయ్యిగాక, అనుకున్నపని జరగే జరగదు.

అందులోనూ ఈ కమ్మలమీాదరావమ్మ చాలాకాలంగా మనసు పెట్టుకొంటుంది. మధ్య ఆకుపచ్చరాయీా, చుట్టూ తెల్ల రాళ్ళనూ, కావాకమ్మగారి చెవులకి అలాంటి కమ్మలు చూసినప్పణ్ణుంచీ అవి పెట్టుకోవాలని.

ఈ ఆలోచనను సీతప్ప రెండేళ్ళుగా పడగొడుతూ వచ్చాడు. "అబ్బే, అవా? చెప్పకు! ఇప్పుడంతా అవే పెట్టు

కుంటున్నారు. అది పాపనేకాదు. నీ కెందుకు నువ్వు తొందర పడక్కు. ఎలాటివి కొనాలో నే చెబుతాగా!" అన్నాడు మొదట్లో. ఆ తరువాత ఇంకా పెద్దెత్తువేశాడు. 'చాకలాడు కమ్మలు నీ కున్నాయాయిరి! మళ్ళీ ఇలాటివే కొనడ మెందుకే పిచ్చిదానా? కాస్త వీలూ చాలూ చూసుకుని యేకంగా రవ్వలకమ్మలే కొనేస్తాం! ఇక్కడ ఈ అరవ దేశంలో కమ్మ లంటే రవ్వల కమ్మలేనూ! రిక్షావాడి పెళ్ళాంకూడా రవ్వల కమ్మలూ, కంచిపట్టుచీరే పెట్టేసుకుంటుంది! వాళ్ళకు రవ్వ లంటే లక్ష్యమే లేదు! అమ్మో! సునాయాసంగా కొనేస్తారు! అన్నం మానైనాసరే రవ్వలుకొనేస్తారేవనుకున్నావోను!" అన్నాడు. చిట్టచివరకు మామూలు కమ్మలు కొనటానికి ఒప్పుకున్నాడు. "ఈ ఏడుగాక ఆ పైయేటికి రవ్వల కమ్మలే కొందాంగదా అవటానుకున్నాను. కాని మరి,నువ్వు తొందర పెడుతున్నావాయిరి. ఇప్పటి కిలాగే వెళ్ళిపోనీ - రాళ్ళు మరీ ఖరీదైపోయాయిట. అబ్బిగాడి పెళ్ళికి ఏడువందలమ్మిన కమ్మలిప్పుడు పదకొండు,పన్నెండొందలట! భరించగలంవా!" అన్నాడు...

ఒకే ఒకగంట గడిచింది. రావమ్మకు అయిదు గంటలు గడిచినట్టున్నది. అన్ని దాఖలాలూ ఎగిరిపోయి అనుమాన మేఘాలు కమ్ముకొచ్చాయి. "ఇవాళ ఆయ(నారు! ఇంకేం వొస్తారు? వొస్తే ఈపాటి కొచ్చీవలసిందేనూ! ఆయనమాత్రమేం జెయ్యగల్రు? విలుపడింది కాదో యేమో! శరీరా లమ్ముకున్న బతుకై పోయె!"

క్షణక్షణానికీ దిగులు హెచ్చిపోయింది. జోసి చెప్పులతో వియ్యాలవారింటి కెళ్ళటమా, లేక ఆ రాళ్ళూడిన కమ్మలే పెట్టుకుపోవడమా? అందరూ తనని చూసి నవ్వి పోతారు. లోలోకంటె హీనంగా చూస్తారు.

ఈవిధంగా రావమ్మగారు విచార సాగరంలో ఓల లాడుతుండగా సీతప్ప వెయ్యిసూర్యుళ్ళ పెట్టుగా రానే వచ్చాడు, ముచ్చెమటలు దిగ్గారుతూ.

"వేగిరం! వేగిరం! ఇంకా నిలబడే ఉన్నావా? కదలాలి! కాస్సంత పొద్దుండగానే సరయిన సరుకుగా జూసి ఎన్నిక చేసుకోవాలి. వాళ్ళెంత దుర్మార్గులు? ట్యూబులైట్లేసి పచ్చా, నీలమూ, ఎరుపూ అంతా ఒకటేలాగ కనబడేట్టు చేస్తారు! ఊఁ! ఊఁ!" అని సీతప్ప రెండెడ్లబండిని తోలే పంపిణీలో రావమ్మను తరిమాడు.

ఆవిడకూడా "తురుమెయిలు" లాగా కదలుతున్నట్టు అభినయంచేస్తూ, "నా ఆలస్యం ఒక్క పిసరులేదు. తలుపులకి తాళాలు వెయ్యడం తరవాయి. అన్నట్టు అబ్బిగాడు ఉత్తరం రాశాడు. చూస్తారా యేవిటి?" అన్నది.

"ఇప్పుడా? వీల్లేదు! మనం మరో పదినిముషాల్లో నగల దుకాణంలో ఉండాలి. అంతే! ఏంరాశాడేవిటి? సీతారత్నం కులాసాగా తిరుగుతోంది గదా? సావిదేవిగారింటో అంతా కులాసాయే గదా?" అంటూ సీతప్ప వాకిలికి ఆదరాబాదరా తాళంవేసి, మళ్లీ తీసి, మళ్లీ వేశాడు.

అన్నిటికీ రావమ్మ, 'ఆహా! ఆహా!' అన్నది.

## 2

ఆ రోజు సీతప్ప లేచినవేళ అంతమంచిదికాదు. ఆయన భార్యాసహితుడై జయంతిలాల్ బన్సిలాల్ వాళ్ళషాపులోకి ప్రవేశించిన అరనిమిషానికిగాని తన యజమానికూడా అదే షాపులో ఉన్నట్లు తెలియలేదు.

"ఏమండీ సీతప్పగారూ! మీరూ ఇక్కడికే వచ్చారే!" అని యజమాని అనేసరికి సీతప్పశరీరం కొయ్యబారిపోయింది. నిలువుగుడ్లు పడ్డాయి. బట్టలన్నీ చెమటతో తడిసి ముద్దయి పోయాయి.

నా భార్యకు రెండువందలు పోసి కమ్మలు కొంటున్నానని యజమానితో యెలా చెప్పటం? చెబితే ఇంకేవన్నా ఉందా? 'ఓహో, వీడు డబ్బు కూడబెట్టాడన్నమాట' అని యజమాని అనుకోడూ?

"ఏమిటాలోచిస్తున్నారు?" అన్నాడు యజమాని సీతప్ప కేసి చూడకుండానే. ఆయనదృష్టి కేసులోని నగలమీదే ఉన్నది.

దాదాపు ఇరవై సెకండ్లపాటు స్తంభించిపోయిన సీతప్ప వాగ్ఝరి కట్టలు తెంచుకున్నది.

"అదేనండి, మా సోమిదేవి—మా అబ్బాయి పెళ్ళినాడు వియ్యాలవారిచ్చిన లాంఛనం బాపతు నాదగ్గరే దిగడిపోయింది గాదూ! మంచి ముక్కుపుడక చూసికొని పంపమంటేనూ, పోనీగదా ఆవటాని — ఒక్కగానొక్క కూతురు

చూడండి, కాదనగలరా? పైపెచ్చు దాని సొమ్మేనాయిరి! స్త్రీ ధనమా, మరోటా ఏమన్నానా! ఎంత ద్రోహం! ఎంత తప్పు! ఎంత యిది! అంచేతను ఆలస్యం అమృతం విషం అని... ఏదో ఇలా—"

సీతప్ప చెప్పినదాన్లో, ముప్పాతిక మువ్వీసం యజమాని వినిపించుకోనేలేదు. ఆయన తన భార్యతో సీతప్పను గురించి చెప్పినట్టున్నాడు. ఆవిడ రావమ్మగారి దగ్గిరికొచ్చి, "రండి, అవ్వగారూ! మా అబ్బాయి పెళ్లి - మీకు తెలిసే ఉంటుంది. కోడలికి నగలు కొందావని వచ్చాం. ఒక రవ్వల హారమూ, ఒక డజను జతల గాజులూ, రవ్వల కమ్మలూ, ఒక రవ్వటుంగరమూనూ. మావారికి జాస్తినగలు గిట్టవు స్మండీ. ఉండేవి కొద్దయినా మంచివిగా ఉండాలని...... ముక్కుపుడకా కొంటున్నారు? మీ అమ్మాయికా? ఇక్కడ చాలా మంచి ముక్కుపుడక లున్నాయిస్మండీ. ఇదుగో చూడు బాబూ..." అంటూ రావమ్మచేత ముక్కుపుడక కొనిపించే ప్రయత్నం సాగించింది.

సీతప్పకు కాళ్లు వణికాయి. నేరక ఒక అబద్ధం ఆడితే అది మిన్నాగై మెడకు చుట్టుకుంది. ముక్కుపుడకకొనడమా, మానడమా? మానాలంటే ఏదిదారి? ఇంతకన్న పెద్దచిక్కేవి టంటే రావమ్మ పులిటనో పడింది. అది చొట్టి వెర్రిబాగుల మనిషి. తను కాపాడవలసిందేతప్ప విడిచి, ఆత్మరక్షణ అసలే చేసుకోలేదు. ఏది దారి? ఏది దారి?

సీతప్ప తన యజమాని చెంతనే నిలబడి, ఆడవాళ్ళి ద్దర్నూ ఒక్కొక్క నగలకేసే చూస్తూ దూరంగా వెళ్ళిపోవటం గమనించాడు. రావమ్మకూడా ఏదో మాట్లాడుతోంది. యజమాని భార్య నవ్వుతోంది! ఖత్తు కలిపేసింది ముత్తానికి! నయవే!

సీతప్ప ధైర్యంచేసి, మీవాళ్ళేవైనా నగానట్రా తీసున్నారా యేవండీ! ఈ రోజుల్లో అదే బెస్టు సేవింగండీ! పడుంటుంది. బాంకుల్లాటివి దివాలాతీసేస్తున్నాయి చూడండీ! బంగారంకొని పడేస్తే వడ్డీ దండుగుండదండి. బంగారం ధర పాపంలా పెరిగిపోతున్నది కాట్టండీ!" అని సొద ఆరంభించాడు.

"నగలు మా కోడలికి. ఈ మాసంలోనేగా మా అబ్బాయి పెళ్ళి? పదెనిమిదివేల నగలు అదివరకే ఆర్డరిచ్చాం. ఇవాళ తీసుకుపోతున్నాం." అన్నాడు యజమాని.

పదెనిమిదివేల రూపాయల నగలే! సీతప్పను ఎవరో మూడుమీద గుర్రపు లాడంతో బలంగా కొట్టినంత పని అయింది.

వాళ్ళు మాట్లాడుతుండగానే జయంతిలాలో, బన్నిలాలో, లేక వారి దగ్గిర బంధువో టిస్యూ పేపరుపొట్లాలూ, పెట్టెలూ ఒక పళ్ళెంలో పెట్టి యజమాని కూచునిఉన్న చోటికి తెచ్చాడు. రాళ్ళ నెక్లెస్, గాజుల జతలు. రవ్వల కమ్మలు, రవ్వల ఉంగరం. సీతప్పకు కళ్ళు చెదిరాయి. ఆడవాళ్ళుకూడా వచ్చి వాటిని చూశారు. రావమ్మకూడా కళ్ళు బైర్లు కమ్మాయి.

యజమాని చెక్కు రాసి ఇచ్చాడు. అట్టపెట్టెలు తీసుకున్నాడు. యజమాని భార్య తన రిస్టువాచీ చూస్తున్న భర్తతో, "మనం ఇంటికి వెళ్ళిపోకు అందుకోగలంవా?" అన్నది. యజమాని తన రిస్టువాచి చూసుకొని, "లేం," అన్నాడు.

ఆయన చప్పున సీతప్పకేసి తిరిగి, "ఏంవండీ, వీటిని మీ యింటికి పట్టుకెళ్ళి రేపు ఉదయం నా ఇంటికి చేర్చగలారా?" అన్నాడు.

"ఓ, దానికేం భాగ్యవండీ! బరువా ఏమన్నానా?" అంటూ సీతప్ప వణుకుతున్న చేతుల్తో ఆ పెట్టెలు యజమాని దగ్గర్నుంచి అందుకున్నాడు.

యజమానీ, భార్యా వెళ్ళిపోయాక రావమ్మ, "అంతా బాగానేవుందిగాని మనం వచ్చిన పనిమాత్రం అట్టే ఉండిపోయింది," అన్నది.

సీతప్ప మానసికంగానూ, శారీరకంగానూ కూడా దివాలాతీసినవాడిలా అయిపోయాడు. యజమాని తనని నమ్మి తన చేతికి ఎనిమిదివేల రూపాయల సరుకు ఇచ్చినందుకు సీతప్ప మనసు గంతులెయ్య గోరుతోంది. ఇంత భారం తన పైన పడినందుకు అది పట్టరాని దిగులుకు కూడా గురి అవుతోంది. ఈ ద్వంద్వం సీతప్పని రాచి రంపాన పెట్టేస్తోంది.

"అమ్మగార్కి ముక్కుపుడకా కావాలి?" అన్నాడోక లాల్ వంశస్థుడు.

"కాదండీ, కమ్మలు, మధ్య ఆకుపచ్చరాయి ఉండి చుట్టూ తెల్లరాళ్ళుంటాయి చూడండి —" అని రావమ్మ ఆరంభించింది. "మధ్య ఎర్రరాయి ఉంటే పనికిరాదాండీ? నన్నడిగితే అది మరింత బాగుంటుందండీ. ఇప్పుడు పచ్చరాయి ఫాషను కాదండీ. మాదేముంది? వెయ్యమంటే వేస్తాము. ఆర్డరిచ్చిపోండి. అయినా ఎర్రరాయి చూడండి. చూస్తే తప్పేమిా?"

క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్—అని కవి అన్నట్టుగానే రావమ్మ మూడేళ్ళుగా పచ్చరాయిని మోహించిన దైనప్పటికీ, ఎర్రరాయి చూడగానే. "ఇదే బాగున్నట్టుందేవండీ' మీరుకూడా చూడండి!" అని సీతప్పతో అన్నది.

"బాగుంటే ఇదే తీసుకో, నన్ను చంపకా!" అన్నాడు సీతప్ప.

తాను మోజుపడి ఇంతకాలానికి కమ్మ కొనేదాకా వస్తే తన భర్త అలా చీదరించుకోవడం రావమ్మకు దుశ్శకునంగా తోచింది.

"మీరు బాగుందంటేనే కొంటాను. లేకపోతే వచ్చినదారే పోదాం. పై సంవత్సరందాకా ఇలానే వుండిపోతాను. ఇంతకాలం ఉన్నాను కానా?" అన్నది రావమ్మ.

ఈ మాటతో సీతప్ప నీరసనంతా విచ్చి చక్కాపోయింది. తన భార్య ఏకంగా రవ్వల కమ్మలకే గాలాం వేస్తోం దనుకున్నాడో యేమో, "అబ్బెబ్బె! అదేవిటి

మళ్ళీనూ! ఎలాగో ఇంతదూరం రానేవచ్చాం. పని వెళ్ళ మార్చుకునే పోదాం. ఏఁవిటంటావూ? మధ్య ఎఱ్ఱరాయూ? బాగానే వుందికాదూ? అదేదో పువ్వులా వుంది!" అన్నాడు.

"హమ్మయ్య! మీకూ్కడా నచ్చిందిగదా. అయితే మరి చేరవాడి కొనీయండి!" అన్నది రావమ్మ. జయంతి లాల్ వంశములోగాని, బన్సీలాల్ వంశములోగాని చేరా లంటూ లేవు. అయినా భార్య ఎదట తేలికై పోకుండా వుండగలందులకు సీతప్ప కూలిలో చేరవాడాడు. బంగా రంలో చేరవాడి లాభం లేదు. సీతప్ప చెప్పేదేదో చెప్పనిస్తూ దుకాణంవాళ్ళు బిల్లు వేసేదేదో వెయ్యనే వేశారు.

రావమ్మ కమ్మలుకూడా చేర్చి ఒకే బంగీకట్టి ఇచ్చారు. దాన్ని అతి భద్రంగా సీతప్ప చంకను పెట్టుకుని పత్నీ సమేతంగా జయంతిలాల్ వాళ్ళ మెట్లు దిగాడు.

## 3

ఇల్లు చేరుకున్నాక భార్యా భర్త లిద్దరూ ఓ పావు గంటసేపు స్వర్గంలో వున్నట్టుగా భావించుకున్నారు. రావమ్మ కొత్తకమ్మలు పెట్టుకుని అద్దంలో చూసుకుంటూ "బాగున్నాయి కాదూ? నా మొహమే మారిపోయింది!" అన్నది.

"ఏదీ నా కనిపించదే? ఎలా చెప్పడం?" అన్నాడు సీతప్ప.

రావమ్మ తన శక్తి సంతా వినియోగించి మొహం అద్దంవేపునుంచి సీతప్పవేపుకు తిప్పింది.

"ఓ, బేషుగ్గా ఉన్నాయి! డబ్బు! డబ్బుపోస్తే కొండమీది కోతి దిగివస్తుం దేవిటనుకున్నా వేవిటోను! ఇంకా డబ్బు పెట్టావూ, ఇంకా అందమైన సరుకొస్తుంది. పిండికొద్దీ రొట్టె! ఎంత చెట్టు కంతగాలి!" అంటూ సీతప్ప అయోమయంలో పడ్డాడు.

"ఏవిటో అనుకున్నాను. ఆవిడకేవీ గర్వం లేదు స్మండీ! యెంత ఇదిగా మాట్లాడింది! డబ్బున్నవాళ్ళుగదా ఎంత అతిశయం ఉంటుందో అనుకుంటాం."

"అదే పొరబాటు. అన్నీ వున్న విస్తరి అణిగుంటుంది. ఏవీలేని విస్తరి ఎగిరెగిరి పడుతుంది. వాళ్ళకేం? లక్షాధికార్లు! కోడలికి పదివేల్రూపాయల నగలు అలా సునాయాసంగా కొనేస్తారు. కొడుక్కి పాతికవేలు కట్నం ఇలా సునాయాసంగా పుచ్చుకుంటారు. నడమంత్రం మనుషులకే లేనిపోని అదిరిపాట్లన్నీనూ. కంచు మోగినట్టు కనకంబు మోగునా అన్నాడు ... అదటుంచు ఇవతల నేనున్నాను గానూ మరీ? నన్ను గురించి ఆయనకు చెడ్డ గురి. ఎన్నిసార్లన్నారుగాదు - నే లేకపోతే ఆఫీసు ఒక్క పూట జరగదని? ఆవిడ కాపాటి లౌక్యం తెలియదా ఏంవిటి? నిన్ను మంచిగా చూస్తే నన్ను చూసినట్టే. మనని మంచిగా

చూట్టం వారికే లాభం ... నువ్వాగు ఈ ఒక్క ప్రశ్నకి సమాధానం చెప్పు. నా మీద ఎంత యిది లేకుండానే, 'ఇదిగో తొమ్మిదివేలు ఖరీచ్చేసే నగలు. నీలో నాకు ఎంత నమ్మకం వుందో చూడు. వీటిని నీ పరం చేస్తున్నాను. రేపు వాటిని భద్రంగా మా ఇంటికి చేర్చే పూచీ నీదీ!' అని నా చేతికి సరుకిస్తాడా! దాన్లోనే తెలిసిపోతుంది గాదుటే, వెర్రిదానా? అన్నవంతా పట్టిచూడాలా!" అంటూ సీతప్ప ఏకపాత్రాభినయంలో పడిపోయాడు.

ఇంతసేపూ తన కమ్మలను - అంటే కమ్మలు ధరించిన తన మొహాన్ని - అద్దంలో చూసుకుంటున్న రావమ్మ, "నేను చాలా ముసిలిదాన్లాగా కనిపిస్తానా ఏవిటి చెప్మా?" అన్నది.

సీతప్ప ధోరణికి బ్రేక్ పడింది. "ఆఁ, ఆఁ? ఏవిటదీ" అన్నాడు.

"ఆవిడ నన్ను అవ్వగారూ అని పిలిచిం దెందుకో? బోసి చెవులతో నేను అవ్వలాగా కనబడి వుంటానా?" అన్నది రావమ్మ.

"అదేవిటీ? ఆవిడా ఇంచుమించు నీ యీడుదే. మహావుంటే ఓపదేళ్లు చిన్న ఉండేను. ఏదో మాటవరసగా అనుంటుంది. ఓవేళ అక్కగారూ అంటే నీకు అవ్వగారులా వినిపించిందేమో. అంతే తప్పవిడిచి వాళ్ళేక్కడా - వాళ్ళ మర్యాదా ఎక్కడా!..."

"అన్నట్టు అబ్బిగాడు వుత్తరంలో నా కమ్మలమాట

కూడా రాకాడంటోయ్. వుత్తరముక్క ఎక్కడపెట్టా నబ్బా?...ఇదుగో చూస్తుండండి. ఇప్పుడే నేను పార్వతమ్మ గారి కీ శుభవార్త చెప్పొస్తా. పాపం. ఆవిడ కొత్త కమ్మలు కొనుక్కోవమ్మా అని తెగ పోరుతోంది. చూసి సంతోషిస్తుంది.”

సీతప్ప చత్వారం కళ్ళజోడు తీసి కొడుకు రాసిన కార్డుముక్క చదవసాగాడు.

రావమ్మగారు మరి కాస్సేపటికి పార్వతమ్మగారితో సహా మళ్ళీ వచ్చేసరికి సీతప్ప కొయ్యబారిపోయి కొద్దిగా వణుకుతున్నాడు. చేతిలో సత్యం రాసిన వుత్తరం వున్నది గాని ఆయన దృష్టి దానిమీద లేదు. ఆమాటకొస్తే ఆయన దృష్టి దేనిమీదా లేదు. సమయాని కక్కడ డాక్టరెవరన్నా వుంటే కళ్ళముందు వేళ్ళు ఆడించి వుండును.

“ఏవిటండీ? ఏవిటలా చూస్తున్నారు?” అన్నది రావమ్మ.

సీతప్ప గద్గదస్వరంతో, “ఏవీభయంలేదు. నువ్వేమీ కంగారుపడకు. ఎలా జరగవలసుంటే అలా జరుగుతుంది. ఆ ఈశ్వరుడుకూడా తప్పించలేడు. కొందరి కలలు నిజమవుతాయి. ఏదో కీడు జరగబోతోందని నాకు ఈరోజు లేచింది లగాయతూ అనిపిస్తూనే వుంది. కమ్మలు కొనడంకంటె గొప్ప విపత్తేమీ జరగదులే ఆవటానుకున్నా! అంత సులువుగా పోతుందా? మనకి రోజులు బాగా లేకే ఈ నగలు నా పాల పడ్డాయి. వాటిని దొంగ లెత్తుకుపోయారో ఇంక మనపని తిరుక్షవురమే! అంత సొమ్ము పోయాక

ఊరుకుంటారా యేమిటి ? కక్కమంటారు. హరిశ్చంద్రాదులను తప్పలేదు. పాండవులను తప్పలేదు..." అంటూ డగ్గుత్తికపడి ఇంకేమీ అనలేకపోయాడు.

పార్వతమ్మగారు పాపం, అందుకుని, "అన్నగారూ, అసలువిషయమేమిటి ? ఎందుకు ఉత్తినే బెంబేలు పడిపోతారు ?" అని దక్షతతో అడిగింది.

సీతప్ప కార్డు చదివి వినిపించాడు. అబ్బిగాడికి కల రానే వచ్చింది. ఇవాళే ఆ బెడంత ఖరీదైన నగకట్టుకు తాను బాధ్యత వహించవలసి వచ్చింది.

"అవునన్నండీ. దొంగతనాలు పెచ్చుమీరిపోయాయి. దొంగలు పేట్రేగిపోయారు. మన వీధిలో రెండిళ్ళల్లో రెండు రాత్రులు వరసగా దొంగలు పడ్డారు. నిన్నగాక మొన్న ఒకేసారి నాలుగిళ్ళలో జొరబడి అందిదల్లా ఎత్తుకుపోయారు. ఈ పోలీసులంతా దేనికో" అన్నది పార్వతమ్మగారు.

సీతప్ప ఆవిడతో పోటీపడి పత్రికలో చదివిన దొంగతనా లన్నీ ఏకరుపెట్టి మరింత దడ పెంచుకున్నాడు.

"ఎన్నిరకాల దొంగతనాలో చెప్పలేం అన్నగారూ! మీాటుప చూడాలని పదకొండు గంటల వేళ పట్టపగలు ఇంట్లో కొచ్చాట్ట. మొగు డాఫీసు కెళ్ళాళ్ట. కొంపలో ఒక్కత్తే ఆడది. కత్తి చూపించి, అరిస్తే చంపేస్తానని బెదిరించి, నగలూ, బట్టలూ, డబ్బూ అంతా ఊడ్చుకుపోయాట్ట." అన్నది పార్వతమ్మక్కయ్యగారు.

"హమ్మయ్యో! కుక్కను పెంచితే దొంగలు రారు!" అన్నది రావమ్మ. పిచ్చిది.

"కొంతలో కొంత నయం. అరుస్తుంది." అన్నాడు సీతప్ప. పిచ్చినర్సవాడు.

"ఏడుస్తుంది!" పార్వతమ్మగారు కుక్కలన్నిటినీ కొట్టి అవతల పారేసింది. "ఎవడు ఒక బిస్కత్తుముక్క వేసినా తోకాడిస్తుంది. ఆపాటి దొంగవాడికి తెలీదా? మన వెనక వీధిలో చెట్టియారిగారింట్లో నాఅంతకుక్క ఉన్నదండోయ్, అన్నగారూ! దాన్ని మేపటం ఎవరి తరం! ఎవరేది పెట్టినా దాన్ని తిననిచ్చారు. అది ఆ చుట్టుపక్కల మూడిళ్ళలో వారాలు చేసుకునేది. ఏమయిందనుకున్నారు? ఇంటిల్లి పాదీ ట్రిబ్లికేను పెళ్ళికెళ్ళారు. వాళ్ళు వచ్చేసరికి ఇల్లంతా ఖాళీ. దొంగలు పూచికపుల్ల మిగల్చకుండా ఊడ్చేశారు. నా అంత కుక్కా వరండాలో పడుకుని గుర్రుపెట్టి నిద్రబోతున్నది."

"దొంగలు మందుపెడతారేమో!"

"మందంటే గ్యాపకవొచ్చింది. నాలుగిళ్ళు దోచారంటినే, ఒక్క ఇంటివాడైనా లేవలేదటండీ. గాఢనిద్ర! ఈ దొంగలు ఏదో మత్తుమందు చల్లుతారుటండీ. అంతే ఒళ్ళుమరిచి నిద్రపోతాం! వాళ్ళ పని వాళ్ళు చూచుకుపోతారు... కుక్కను నిజంగా పెంచాలంటే జాతికుక్కను కొనాలి. ఇంట్లోవాళ్ళుతప్ప ఇంకెవరికీ అది మాలిమికాకుండా చూడాలి. దానికి మదమాంసాలు బాగా పెట్టాలి. అప్పుడది దొంగ దొరికితే చీల్చేస్తుంది. పై వీధిలో నాయుళ్ళింట్లో

అలాటి కుక్క ఉంది. దానికింద వాళ్లకు నెలకు నూరు రూపాయలు ఖర్చుట! మనం భరాయించగలవా?" అన్నది పార్వతమ్మక్కయ్యగారు. "ఏవండోయ్, పార్వతమ్మక్కయ్య గారూ, ఆ ఇనపబీరువా ఒకటి కొనితెచ్చి కొంపలో పారెద్దురూ!' అని ఎన్నిసార్లు పోరానో అడగండి, విన్నారు కారు!" అని రావమ్మ ఫిర్యాదు చేసింది.

"ఇవాలంటే ఈగ తరొచ్చి పడిందిగాని మనకేవుందే ఇనప్పెట్లలో దాచుకుందుకూ? నా రామకోటి చోరులు కోరని నిధిగదా!" అన్నాడు సీతప్ప.

"అదేంమాట, అక్కగారూ? ఇవాళ కమ్మ కొన్నాం గామా? మన ప్రాణానికి ఇవి దొంగా డెత్తుకుపోతేచాల్దూ?" అన్నది రావమ్మ.

"అదే పొరబాటు. ఇంట్లో బీరువా వుందని తెలిసిన మరుక్షణంనుంచీ దొంగాళ్లు ఇంటిచుట్టూ కాకుల్లా తిరుగుతారు. నీకు తెలీదుగాని, ఇనప బీరువాలు అమ్మే కంపెనీల్లో ఈ దొంగోళ్ల మనుషు లుంటారు. 'ఒరే, ఫలాని ఎడ్రసుకు ఇవాళ ఒక బీరువా వెళ్ళింది' అవటాని వాడు దొంగాడికి టెలిఫోన్‌లో చెప్పేస్తాడు. ఇంకే వుందీ?" అన్నాడు సీతప్ప, ఆడాళ్లేగదా అని కోసిపారేస్తూ.

కాస్సేపు ఎవరి ఆలోచనల్లో వా రుండిపోయారు. సీతప్పకు గుండెలో వణుకు తెరలు తెరలుగా వస్తున్నది. ఈ రాత్రి తెల్లారడ వెలాగ? ఈ భయం తెరలు తెరలు రావడాని క్కారణం సీతప్పకు చటున్న అర్థమయ్యింది. తాను ధైర్యం తెచ్చుకోటానికి చేసే ప్రయత్నం విఫల

మైనప్పుడల్లా భయం రెట్టింపవుతోంది. అంతకంటె భయ పడుతూ ఉండడమే క్షేమంగా వుంది.

"మాటల సందట్లో టైమే తెలీలేదర్రా. నే వెళ్ళి వంటపని చూసుకోవాలి. వస్తా. ఈ రాత్రికి దేవుడిమీద భారం వేసి ఎట్లాగో గడిపెయ్యండి. ఏం చేస్తాం? అన్నింటికీ వాడే ఉన్నాడు" అంటూ పార్వతమ్మగారు లేచింది.

"ఇంతవరకూ మమ్మల్ని ఆ శ్రీరామచంద్రమూర్తి వారే కనిపెట్టి వున్నాడు. అంథా వాడి దయ! అయినా, అక్కగారూ, ఈ రాత్రికి మీరుకూడా మాతో తోడుండ కూడదూ? మనిషికి మనిషితోడు! ఏమంటారు?" అన్నాడు సీతప్ప దీనంగా.

"మావాడు ఊళ్లో లేడుగదా, అన్నగారూ! కోడలు ఒక్కతే ఉండదూ? మరేం భయంలేదు. ఇప్పుడు మూడో ళ్ళుగా ఇంటో నేనూ అదీనూ. మాకులేని భయం మీకే మిటి?" అంటూ పార్వతమ్మ సహాయ నిరాకరణం చేసి వెళ్ళిపోయింది.

"ఎందుకైనా మంచిది, వీధి వాకిలి తాళం వేసిరండి. చచ్చి గీ పెట్టినా తియ్యొద్దు—బ్రహ్మదేవుడొచ్చేని" అన్నది రావమ్మ.

"కాకపోతే ఏమిటి? నీ కెందుకు కంగారు? తెల్లార్లూ మేలుకుందాం. దీపాలన్నీ వెలిగించి ఉంచుదాం. దొంగాడు దీపాలున్న ఇంటోకి రాడు" అన్నాడు సీతప్ప గుండె రాయి చేసుకుని.

## 4

ఆ రాత్రి ఇద్దరికీ అన్నం సయించలేదు. రావమ్మకు దొంగల ఆలోచన ఏమీ లేదు. తాను కమ్మలు పెట్టుకుని వెళ్ళినప్పుడు సోమిదేవి ఏమంటుంది? షాపువాడు చెప్పింది నిజం—ఈ కమ్మలే బాగున్నాయి. ఇంకోరూ ఇంకోరూ పెట్టుకుంటే ఏమోగాని తన మొహానికి నప్పాయి. ఆవిడ అక్కగారూ అనే వుంటుంది—ఎంచేతో తనకు అవ్వగారూ అన్నట్టు వినిపించింది. పాపం, ఈ కమ్మలు ఏ వేళ కొన్నారో గాని, ,ఆయన వాటికేసి చూసిన పాపానకూడా పోలేదు— దొంగాడి భయం ఓటి వచ్చిపడిందాయిరి. చాదస్తం మనిషి! ఏం దొంగాడు? ఇంటో ఇంత ఖరీదైన నగకట్టున్నట్టు ఎవరికి తెలుసు—ఒక్క పార్వతమ్మగారు తప్పితే?

సీతప్ప నట్టింటో నిటారుగా కూచుని రామకోటి శరవేగంతో రాస్తున్నాడు. రావమ్మ గోడకి చేరగిలబడి కూచుంది.

"కన్ను మూసేవుస్మే! నిద్రపోగలవు! మరేం భయం లేదు. కంటికి రెప్ప తోడన్నారు", అంటూ సీతప్ప రామకోటి బరికేస్తున్నాడు.

రావమ్మ మధ్య మధ్య చెవులు తడివిచూసుకుంటూ కమ్మల్ని ఆపేక్షగా నిమురుతున్నది. దీపాలు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయి. ఒక్కసారి అద్దంలో చూసుకుంటే బాగుణ్ణు, కాని—

రాస్తూ రాస్తూన్న సీతప్ప తలఎత్తి రావమ్మకేసి చూశాడు. రావమ్మ గోడకు చేరగిలబడి కూచుని నోరు తెరుచుకుని నిద్ర పోతున్నది.

"ఇదుగో, ఏమేవ్? లే, లే! ఇలాగైతే ఈ రాత్రి వెళ్ళమాకెనట్టే" అన్నాడు సీతప్ప.

"అబ్బ! మీరు మేలుకునే ఉన్నారు గాదుటండీ ? మీకు నిద్ర తూగొస్తే నన్ను లేపండి. ఇద్దరమూ జాగారం దేనికీ?" అంటూ రావమ్మ కొంగు పరుచుకుని నడుం వాల్చి బహిరంగంగా నిద్ర కుపక్రమించింది.

సీతప్ప రామకోటి రాస్తూనే నిద్రపోయి వుండాలి. ఎవరో ఒక కారులో డబ్బు పెట్టుకుని వేగంగా పోతున్నట్టూ రెండో కార్లో కళ్ళకు నల్లగంతలు కట్టుకున్న వాళ్ళు వెంబడిస్తున్నట్టూ కల వచ్చింది.

కారు హారను చప్పుడుకు సీతప్ప ఉలికిపడి లేచాడు. తను ఇంటి బయటే ఎవరో హారన్ కొడుతున్నట్టు తోచింది.

సీతప్ప రహస్యంగా భార్యను లేపి, "బయట దొంగ లేనేమో హారన్ కొడుతున్నారు. మనం తలుపు తీశామన్నట్టాయినా పిస్తోళ్ళతో మనని కాల్చి లోపల ప్రవేశించి సొమ్ము కాస్తా తీసుకుని కారులో వుడాయించేస్తారు" అన్నాడు.

రావమ్మ అంతా విని, "మీరు మీ మానాన రామకోటి రాసుకోండి" అంటూ మళ్ళీ కన్ను మూసుకున్నది.

"సీతప్పగారూ! ఓ సీతప్పగారూ!"

"ఎవరో నన్ను పేరుపెట్టి పిలుస్తున్నారేవ్?" అన్నాడు సీతప్ప రహస్యంగా భార్యతో.

"మాట్లాడక పడుకోండి" అన్నది రావమ్మ నిద్ర మత్తున.

హారన్ మోతలకు మనుషుల గొంతులు తోడయాయి. సీతప్ప రామకోటి రాయటం మానేసి బయటి కలకలం ఆలకించాడు.

చాలామంది చేరారు. మామూలు దొంగలు కారు. బందిపోటు దొంగలై వుంటారు!

"దీపాలన్నీ వెలుగుతున్నాయి. యెంత పిలిచినా పలకరేం? ఇంటిల్లిపాదీ విషంగాని పుచ్చుకోలేదు గద!"

"తాళం పగలగొట్టండి. చూస్తారేమిటి?"

ఈ విధంగా బయటి జనం మాట్లాడటం విని సీతప్ప పెళ్ళాన్ని మళ్లీ లేపాడు.

"వీధి వీధంతా లేచినట్టున్నారు. పోనీ ధైర్యం చేసి కిటికీలోంచి ఎవరు వారని కేక పెడతావా ఏవిటి?" అన్నాడు.

"ఆపని మీరే చేద్దురూ — చంపకా!" అన్నది రావమ్మ సోమిదేవి కమ్మలు మెచ్చుకుంటున్నట్టు ఆరంభమైన కల కాస్తా భగ్నమయింది.

విధిలేక సీతప్ప బయటిగది కిటికీదాకా వెళ్ళి, వణుకుతున్న గొంతుతో, "యెవరూ?" అన్నాడు.

"తలుపు తియ్యవయ్యా, వెర్రిబ్రాహ్మడా!" అన్నాడు

యజమాని. వొక వందమంది గొల్లున నవ్వుతూ మాట్లాడి నట్టు సీతప్పకు వినిపించింది.

తన యజమానినా ఇంతసేపూ నిలబెట్టాడు? అమ్మయ్యో, ఆయ నేమనుకుంటాడు?

"ఏమేవ్, వేగిరం! వేగిరం!"

"ఏం కావాలండీ?"

"తాళాలే! తాళపు చెవులు! అవతల కనిపెట్టుకు నున్నారు...వస్తున్నానండయ్యా! ఒక్క క్షణం! వచ్చె, వచ్చె...... వేగిరం, వేగిర వంటూంటేనూ!"

ఎలాగైతేనేం తాళపు చెవులు దొరికాయి. గేటు తెరిచి సీతప్ప యజమానిని లోపలికి దయచెయ్యమన్నాడు. లోపలికి దయచెయ్యననీ, ఆ నగల పెట్టెలు ఇచ్చేస్తే వెళ తాననీ అన్నాడు యజమాని.

సీతప్ప వారి నగల పెట్టెలు వారికి అప్పగిస్తూ "ఒక్క సారి చూసుకోండి. ఎందుకైనా మంచిది. సొమ్ముతో కూడిన పని. అంత్య నిష్ఠూరంకన్న ఆది నిష్ఠూరం మేలన్నారు!" అన్నాడు.

వినిపించుకోనట్టుగా యజమాని నగల పెట్టెలు తీసుకుని కారు స్టార్టుచేస్తూ, "ఏమన్నా పోతే మీదే పూచీ!" అని వెళ్ళిపోయాడు...

మర్నాడు సీతప్ప ఆఫీసుకు వెళ్ళినప్పుడు గోవింద

రావు, "సీతప్పగారూ, మీరు డబ్బు మహా దూబరా చేస్తా రటగా. మన బాస్ అందరితోనూ అన్నారు" అన్నాడు.

"నేనా?" అన్నాడు సీతప్ప ఆశ్చర్యంతో.

"అవును. తెల్లవార్లూ దీపాలన్నీ వెలిగించి ఇంటిల్లి పాదీ గాఢనిద్ర పోతారట?" అన్నాడు గోవిందరావు.

సీతప్పకు యేడవాలనిపించింది.

## 5

"అయిపోయింధి, అయిపోయింది! అంతా అయి పోయింది! ఈ దెబ్బతోటి అందరి కష్టాలు గట్టెక్కుతాయి," అన్నాడు సీతప్ప వసారాలో చెప్పులు విడుస్తూనే.

రావమ్మగారు చాకలికి వేసేబట్టలు మూటగట్ట బోతూ, ఒకటి రెండు బట్టలకు చినుగులుంటే కుట్టుతున్నది. సీతప్ప వచ్చినట్టూ, ఏదో అన్నట్టూ గ్రహించింది గాని ఏవన్నదీ వినలేదు. అదేదో తరువాత నింపాదిగా అడిగి తెలు సుకోవచ్చు—ముందు తా నాయనకి చెప్పాలిసిన కబురోహ టున్నది.

ఆవిడ లేచి భర్తకి ఎదురొచ్చి, "విన్నారా?" అన్నది ఉపోద్ఘాతంగా. ఉపోద్ఘాతం మటుకే చదివి పుస్తకవంతా చదివాననుకుని రివ్యూ రాసేసే విమర్శకుడిలాగా సీతప్ప,

"ఎందుకు వినసే, పిచ్చిదానా? అంతా విన్నా!" అన్నాడు. కాని ఆయన మొహాన ఆనందరేఖ ల్లేవు.

"ఆఫీసుకు కూడా ఉత్తరమ్మొచ్చిందా యేమిటి?" అన్నది రావమ్మ.

"నాకు రాలేదనుకో. మా ఆఫీసులో ఇద్దరి కొచ్చాయి ఉత్తరాలు! రవణాశ్రమం నుంచి" అంటూ కోటువిప్పి వొంకీకి తగిలించాడు సీతప్ప.

ఆయననేది రావమ్మ కొక్కముక్క బోధపళ్ళేదు. "మీరనేదేవిటో నా కొక్కముక్క బోధపళ్ళేదు," అన్నదావిడ. "రవణాశ్రవవేవిటి? ఉత్తరాలేవిటి?"

ఎవరికీ పట్టనట్టూరుకున్నారాయి రందరూ! ఆ రవణాశ్రమం వాళ్ళే లోకహితం కోరేవారు గనక. ఏవ బ్రోయ్, కొంపలంటుగుంటున్నాయి. జాగ్రత్తపడి ప్రాణాలు రక్షించుకోండవటాని ఎరిగున్న వారందరికీ పోస్టు ఖర్చులు భరించి రాస్తున్నారు! కరపత్రాలు పంపుతున్నారు. అంతకంటే వాళ్ళుమాత్ర వేం చేయగల్రూ?" అన్నాడు సీతప్ప చొక్కాకూడా విప్పి జంఝం దువ్వుకుంటూ.

రావమ్మకు జ్ఞానోదయమయింది.

"నేనొక విషయం మాట్లాడుతుంటే మీరు మరోటి మాట్లాడుతున్నాట్లావుంది. మనకోడలి ప్రసవం గురించి నే మాట్లాడుతూంట!" అన్నదావిడ.

"ఏవిటేవిటీ? ఇంత సేపాయి చెప్పవేం? ఏం పిల్లవాడు పుట్టాట్ట?" అన్నాడు సీతప్ప, మిగతా విషయాలన్నీ

మరిచిపోయి కొను తాత అయిన సంబరంలో మునిగి తేలుతూ.

"నే నింతసేపూ ఆమాటే చెబుతూంట. సుక్రారం నాడు—అంటే సరీగా వారందాటి రెండు—"

"కనేరోజు లేనూ! మనం మరిచేపోయాంగానీ! పేరెట్టడం దగ్గిరే అసలుపేచీ. చంటాడికి నా పేరే పెట్టడం వో పద్దతనుకో. అయితే కొందరికి పట్టింపు—తాత బతికుండగా అదే పేరు పెట్టరాదనీ! ఏవిటో వెర్రి పట్టింపులు! అదలా వుంచి మన యింటి దేవుడు శ్రీరామచంద్రమూర్తి వారున్నారు. అవతల యేడుకొండలవాడుండనే వున్నాడాయిరి! ఏవన్నా తక్కువ దేవుడు గనకనా! అబ్బో, చెప్పనలవిగాని మహాత్తుమతి!" అని సీతప్ప సోదిలో పడ్డాడు.

"మీరింకా పెరట్టారినే వున్నారు. అబ్బికి—"

"అయితే యేడుకొండల వాడితో అట్టే పేచీలేదు. ముందు వెంకట అని చేర్చేస్తే అతడికి తృప్తేనూ. మాట వరసకి వెంకట శ్రీరామచంద్రమూర్తి అని పెట్టావనుకో, ఇద్దరి దేవుళ్లూ సమాధానపడిపోతారు. అంతగా అయితే వెంకట శ్రీ సీతారామచంద్రమూర్తి అంటే నా పేరూ కలిసొచ్చినట్టే అవుతుంది. తఖ్ఖేదు!"

"అబ్బికి ఆడపిల్ల!" అంది రావమ్మ సందు చూసుకుని.

"ఆడ—!" సీతప్ప తెరిచిన నోరు మూయలేదు. ఆయన కట్టుకున్న ఏ గాలియిళ్లో కుప్పన కూలిపోయాయి.

"ఎప్పుట్టూ?"

"మొదటి సంతానం ఆడపిల్లవడం అదృష్టం. లక్ష్మి పుట్టింది" అన్నది రావమ్మ.

"లక్ష్మి—అప్పుడే బారసాలా, నామకరణవూ అంతా చేసేశావేమిటి?" అన్నాడు.

"అబ్బే! నానుపొచ్చి ఆ కిందటి సుక్రారవేగదూ. నిన్నటికి వారం! బారసాలా గట్రా ఎల్లుండో ఆ మర్నాడో చేస్తారు."

"అన్నట్టు నీ కిదంతా ఎవరు చెప్పేరూ?" అన్నాడు సీతప్ప.

"అబ్బి ఉత్తరం రాశాడు. ఇస్తా నుండండి."

సీతప్ప ఉత్తరం చూసుకుని సంగతులన్నీ గ్రహించుకున్నాడు. తొమ్మిదో తారీఖు రాత్రి పదిగంటల నలభై రెండు నిముషాలకి సీతారత్నం ఆడపిల్లను కన్నది. దుష్ట నక్షత్రం కావటం చేత పెద్ద పెట్టున శాంతీ, నవగ్రహాపూజా వగైరాలు చేయించాలి. నాలుగైదొందలు ఖర్చౌతుంది గనక సీతప్ప డబ్బు సేకరించి ఉత్తరం అందిన మూడోనాడు బయలుదేరి రావలెను. ఇంతే సంగతులు.

నాలుగైదొందలే! ఎక్కడి డబ్బూ హరించి పోతోందిగద!

"అసలే ఆడపిల్ల, ఆపైనచచ్చే శాంతట! ఖర్చులు మనం భరించాలట! యెక్కడైనాకద్దా? ఎవరింట పురుడోసుకుంటే వారు ఖర్చుభరించడం సబబు. ఏవంటావు?"

"శాంతికర్మ ఖర్చు మనమే భరించవలిసుంటుందేమో మరి" అన్నది రావమ్మ అనుమానంగా.

"అసలు నువ్వుండు. దీని వైనమంతా శాస్త్రుల్లుగార్నడిగి తెలుసుకొస్తాను. వాళ్ళకేం తెలుసే. వెర్రిదానా? వొట్టి నాస్తికులు! ఓ దేవుళ్ళేడు, ఓ దైవం లేదు! అలానే యీ ప్రళయం విషయంకూడా కనుక్కొస్తా" అన్నాడు సీతప్ప. నాస్తికులే పెద్ద శాంతి అవటాంటూంటే శాస్త్రుల్లుగారు యాగాలే చెయ్యాలంటాడేమోనని సీతప్పకు లోపల దడగానే వుంది.

"ప్రళయమేమిటండోయ్!" అన్నది రావమ్మ.

"సారిపోయింది! నువ్వింకా వినేలేదూ? నేనురాగానే దాన్నిగురించేగదూ చెప్తా? ప్రళయం వచ్చేస్తోందిట. నవగ్రహ కూటం. అంటే, తొమ్మిదిగ్రహాలున్నూ ఆపళంగా ఒక్కచోటచేరి ఊరుకుంటాయి. ఇంక అడిగావూ, భూకంపాలేమిటి, అగ్నిపర్వతాలు బద్దలు కావడమేమిటి, పిడుగులు పడి పోడమేమిటి, అంతలేసి మేఘలు గభాల్న కూలిపోడమేమిటి, నదులు సముద్రాలు పొంగేసి భూమిని ముంచెయ్యడమేమిటి—సర్వనాశన మనుకో! ఒక్క ప్రాణి మిగల్దు! సూరీడు కనిపించడు! ఎటో వెళ్ళిపోయి దాక్కుంటాడు. సూర్యచంద్రులు గతులు తప్పడమంటే ఇదేనూ నవగ్రహ కూటమంటే మాటలా. అబ్బో!"

"అయితే మరి మీరా ఆఫీసో?" అన్నది రావమ్మ అంతా విని.

"పువేర లేదు, అంతఘురవన్నట్టు, ఓ చెంపని ప్రళ

యం వచ్చేసి సర్వనాశనవై పోతుంటే ఇంకా ఆఫీసేవిటే, నెత్రిదానా?"

"ఈ ప్రళయం ఎప్పుడొస్తుందిటా?"

"ఎప్పుడో నా? పై మాసం నాలుగైదు తేదీల్లోనే. మద్రాసు మీదికి వెయ్యి నిలువుల నీరొచ్చి ఇరవైనాలు ఘంటలసేపు తియ్యకుండా ఉండిపోతుందట!"

రావమ్మ ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కుకుని, "యీ ఉపద్రం తప్పే దారే లేదా?" అని అడిగింది.

"ఎందుకు తప్పదూ? చాలామంది ప్రయాణపు ఏర్పాట్లు చేసేస్తున్నారు.నూఆఫీసులో సహం మందికి పైగా ముందుగానే సెలవు దరఖాస్తులు పెట్టేశారు. జలప్రళయం తీసిపోయాక వస్తారు. మద్రాసు పట్టణవంతా మళ్ళీ కట్టుకోవాలి."

రావమ్మకు గొప్ప ఆలోచన వచ్చింది. "అప్పుడు మనంకూడా ఎక్కడో ఇంత స్థలం కొని ఇల్లుకట్టేస్తాం. అద్దె కింద ఎంత డబ్బూ నాశనవై పోతోంది" అన్నది.

"భేషుగ్గా చెప్పావు!" అన్నాడు సీతప్ప.

## 6

సీతప్ప భయపడినంతా అయింది. శాస్త్రుల్లుగారు పిల్ల జననకాలం చూస్తూనే చక్రంవేసేసి, "ఎబ్బే, చాలా పాడు నక్షత్రం. ఇటూ అటూకూడా అందరికీ చెరుపు" అన్నాడు.

సీతప్పకు దడపుట్టింది. తన కసలే రోజులు బాగు లేవు. యెందుకోమరి ఆ శ్రీరామచంద్రమూర్తి వారు తన నిలా పరీక్షిస్తున్నాడు.

"శాంతీ గట్రా చేయిస్తేగానీ అశుభం తొలగదంటారా శాస్త్రుల్లుగారూ?" అన్నాడు సీతప్ప.

శాస్త్రుల్లుగారికి శషభిషలు పనికిరావు.

"అయ్యా, సీతప్పగారూ! నే నొక్కటే చెబుతాను వినండి. మంత్రాలతో చింతకాయలు రాలవన్నప్పుడు శాంతులతో గ్రహస్థితి మారుతుందండీ? అలా మారే మాటుంటే యింక జ్యోతిషవెందుకూ, తగలెట్టనా?" అని అడిగాడు.

"మరి శాంతులూ గట్రా చేస్తూనే వున్నాంగదా!" అన్నాడు సీతప్ప జిడ్డుగా.

"అదంతా మనమంచికోసం. మాటవరసకి చెబుతా. ఈ పిల్ల తాతగారి గండాన పుట్టిందనుకోండి. తాతగారికి గండం తప్పటం ఎలానూ ఉండదు. కాని చచ్చాక ఆ లోకంలో తాతగారికి దశలూ, విదశలూ కలిసొస్తాయి." అన్నాడు శాస్త్రుల్లుగారు.

"చచ్చాక దశలూ, విదశలూ ఏవిటి, శాస్త్రుల్లు గారూ?" అన్నాడు సీతప్ప.

"అలానుకోకండి. ఒక దివ్యవైన మహాదశారంభంలో కొందరు చచ్చేపోతారు. కాని చచ్చాక అవతలి లోకంలో వారికా మహాదశ అద్భుతంగా యోగించి సుఖపడిపోతారు. చచ్చినంతమాత్రాన గ్రహాలు వదిలేస్తాయనుకున్నారు గావోసు! పొరపాటు."

"శాంతిచేసినా ఫలితం వుండదన్నారుగా ? ఆ లోకంలోగాని ఫలితం వుంటుందా ఏమిటి?"

"ఫలితమంటే ఏవిటీ? గ్రహాలు కష్టసుఖాలు తెచ్చిపెట్టగలవేగాని పాటికి తట్టుకునే శక్తి మన్లోవుంద. గ్రహశాంతి చేస్తే మనం తట్టుకోగలుగుతాం. మాటవరసకి ఈ పిల్ల తాతగారికి ధననష్టం రాసిపెట్టుందనుకోండి. గ్రహశాంతి చేసినట్టయితే ఆస్తంతా తుడిచిపెట్టుకు పోయినా ఖాతరు చెయ్యడు. ఒక్క చిటికేసి ధనార్జనకు నడుంకట్టి బయల్దేరతాడు."

"తమరు చెప్పిందిప్పుడు నాకు బోధపడింది. అయితే గ్రహశాంతి చెయ్యటవే మంచిదని తమసలహా? అలాగే చేద్దాం." అంటూ సీతప్ప శాస్త్రుల్లుగారిదగ్గిర సెలవు పుచ్చుకున్నాడు.

ఇంటికి తిరిగొస్తూనే ఆయన రావమ్మతో, "శాస్త్రుల్లు గారు పిల్లకి చక్రవేసి అంతా విశదంగా చెప్పేశారు. పిల్ల పుట్టిన నక్షత్రం చెడ్డదేనూ.మనవాడి మావగారికి ఖాయంగా ప్రాణగండంట! ఆస్తంతా కరారావుడై పోతుందిట. వెర్రి బ్రాహ్మడు, నా ఖర్చులో శాంతి జరుపమంటున్నాడు. అందువల్ల అతడికి ఒక్క పిసరు లాభవుండదు. శాంతి ఖర్చులు మీరే భరించండి. ఎందుకు చెప్పానో చెప్పాను. ఆవటాని ఉత్తరంముక్క రాసేస్తాను" అన్నాడు.

అనటవేవిటి, రాయటవేవిటి అంతా క్షణంలో అయిపోయింది. "చిత్తగించవలెను" అని రాసి సీతప్ప,సంత

కం పెట్టటానికిగాను కార్డుకు కొంచెం ఎగువగా గాలిలో తనపేరు రాయడం రిహార్సల్ చేస్తూండగా "శేషంపిన్ని"గారొచ్చారు.

"రండి, పిన్నిగారూ! విన్నారుగా? మనవరాలు కలిగింది. శాంతిట! హోమ శాంతీ, గ్రహశాంతీ అంటున్నారు. మావారు శాస్త్రుల్లుగారి నడిగొచ్చారు కూడానూ" అని చావమ్మ గబ గబా క్షణంలో అన్ని సంగతులూ చెప్పేసింది.

ఆడంగులు మాట్లాడుతుంటే విని సీతప్ప ఎప్పుడూ అసూయపడేవాడు. వాళ్ళు ఎన్నో విషయాలు ముచ్చి మూడు ముక్కల్లో చెప్పేస్తారు. టెలిగ్రాం కొట్టినట్టేనూ! వాళ్ళకా ట్రిక్కు తెలుసును. మనకి—అంటే మగాళ్ళకి— ఆ సులువు తెలీకుమరి. ఒక్క చిన్న విషయం చెప్పడానికే ఎంతో సేపవుతుంది. అప్పటికీ చెప్పేది సరిగా చెప్పావా లేదా అన్న అనుమానం అట్టే ఉండిపోతుంది. ఆడాళ్ళా! అమ్మో! వేదవ్యాసు డాడదై ఉంటే భారతమంతా అయిదుపేజీల్లో రాసును. కాని దాన్నెవరూ చదవకేపోదురు. అదీ అసలు కిటుకు. తనభార్య శేషం పిన్నిగారికంతా చెప్పిందేగాని ఆవిడ తెలుసుకోవలిసిన అసలు విషయం చెప్పనేలేదు.

"అసలు సంగతీ నే నరటిపండులా వొలిచి పెడతాను వినండి, పిన్నిగారూ! నక్షత్రమైతే చెడ్డదేనూ. చెడ్డ నక్షత్ర వన్నాక శాంతీ గట్రా చేసుకోక వీల్లేదాయిరి. ఏమంటారు? మీరే చెప్పండి. శాస్త్రరీత్యానున్నా, ఈ శాంతిగట్రా

మన మంచికేగాని దీనివల్ల గ్రహగతులు మారేది లేదు గదా. యెవరో మహా పతివ్రతలు - అదైనా యే ద్వాపర యుగంలోనో! కలియుగంలో మట్టుకాదు-సూర్య చంద్రాదుల్ని నిలవేశారుగాని, ఈ కాలంలో మనతరమా? అయితే ఈ శాంతీ గట్రా యెవరిమంచికీ అన్న ప్రశ్నొస్తుందిగదా మరి? గ్రహ వీక్షణంవల్ల ఎవరికి చెరుపుంటే వారేగద శాంతి చేసుకోవాలి! ఇప్పుడీ సందర్భంలో శాంతి చేసుకునే పూచీ అంతానున్నూ మా వియ్యంకుడుగారిమీదే పడినట్టు శాస్తుల్లుగారు స్పష్టంగా చెబుతున్నారు" అన్నాడు సీతప్ప.

పిన్నిగారసాధ్యురాలు ! సిద్ధాంతిగారి కోడలా, మరోటా! ఠక్కుమని "మాతామహ స్థానానికి చెరుపని శాస్తుల్లుగారు చెప్పారందరూ" అనేసింది.

సీతప్ప మొహం శీతకాలంలో కొబ్బరినూనెలా పేరుకు పోయింది. ఆయన ఒక్క గుటకేసి. "మాతామహ- తామాతా — అంత యిదిగానున్నూ — తాతత్రా—" అన్నాడు.

"చెరుపు పితామహ స్థానానికో, మాతామహ స్థానానికో స్పష్టంగా తేల్చుకోవాలన్నగారూ"అన్నది శేషంపిన్ని.

సీతప్ప కొంచెం తెప్పరిల్లుకుని, "అదే వచ్చిపడింది. ఆ శాస్తుల్లుగారేదీ స్పష్టంగా చెప్పలేదు. అసలు గ్రహ శాంతేవిటి పొమ్మంటున్నాడు కాస్సేపు. మరి కాస్సేపు శాంతి చేసుకోవడం మంచిదేనూ అన్నాడు. ఇంకాస్సేపు తాతగారికి చెరుపన్నట్టే చెప్పాడుమరి. పిల్ల—అంటే మా

కోడలు—పుట్టింది లగాయతూనున్నూ — నా ఉద్దేశం, పెళ్ళయాక కూడా—వారింటే ఉండి, అక్కడే పురుడోసుకుని, అక్కడే అంతా గనక గ్రహదోషం వారినే హెచ్చుగా బాధిస్తుంది గదా అని—" అంటూ నీళ్ళు నమిలాడు.

"నువ్వు మాత్రం తాతవు కాకుండున్నా, వెర్రి బ్రాహ్మడా?" అనేసింది శేషంపిన్ని. "శారదాల ఆవులెల్లుండనా అన్నారు? విశేషంగా వెళ్ళి శాంతి చేసేసుకోండి. మెడ మీద తలున్నవాడెవడూ శాంతి వద్దండు."

శేషంపిన్నిగారు చాలా సేపు కూచుని దుష్టనక్షత్రాల ప్రభావమూ, దుష్టగ్రహాల ప్రభావమూ గురించి ఎన్నో ఉదాహరణలు చెప్పింది. సీతప్ప వాక చెవితో అదంతా వింటూనే ఇంకో చెవితో కర్తవ్యం ఏవిటిగదా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"—ఆ పిల్ల సవర్తాడిన నక్షత్రం మహా చెడ్డది. వైధవ్యయోగవని మా మావగారప్పుడే చెప్పేశారు. శాంతి భాకీ ఎత్తున జరిపారు. వారికేం? మహారాజులు, లక్షాధికార్లు, తరువాత గర్భాదానానికి ముహూర్తం కూడా నిర్ణయించారు. మొల్లుండి గర్భాదానవనగా పిల్ల మొగుడు కాస్తా చచ్చి ఊరుకున్నాడు. ఆ మరుసటేడు దాని మేనమావ కూతురు అదే నక్షత్రాన రజస్వల అయింది. శాంతి చేశారు. నక్షత్ర జపం చేయించారు. గర్భాదానం కాకుండానే దాని మొగుడూ పోయాడు... యిప్పుడు మీ మనవడు పుట్టిన నక్షత్రానే ఆ కోదండరావయ్యగారి రెండో కోడలు కూడా ప్రసవించింది.

బిడ్డకు ఆరునెల్లు నిండకుండానే కోదండరావయ్యగారి ఇల్లూ, పొలాలూ తుడిచిపెట్టుకు పోయాయి. మరో ఆరు నెల్లకి కోదండరావయ్యగారికే కాలం తీరిపోయింది…"

ఇలాటి దాఖలాలన్నీ వింటున్నకొద్దీ సీతప్పకూ, రావమ్మకూ కూడా గుండె బెదురు హెచ్చిపోసాగింది. శేషంపిన్నిగారు వస్తానం జెప్పి లేచి వీధి గుమ్మంకూడా దాటిందో లేదో, రావమ్మ: "ఏవవసిండి గాక, ఎంత ఖర్చవసిండి గాక, శాంతి యథావిధిగా జరిగితీరవలిసిందే!" అన్నది.

"నాకూ అలానే అనిపించింది స్మీ. నేనింకా దూరవాలోచించాను. నక్షత్రాలే ఎంత చెడ్డవో విన్నాం గదా. నక్షత్రాలకన్న గ్రహాలు బలవత్తరవైన వాయెను. చెడ్డ నక్షత్రవంటే, ఆ నక్షత్రాన సవర్తాడవో, పురుడు రావడవో జరిగితే ఆ వొక్క మనిషికి మాత్రవే చెరుపు; తతిమ్మా మనుషులంతా సుఖంగానే వుంటారు. గ్రహాలలాక్కాదే. అవి నక్షత్రాల్లాగా ఉన్నచోటుండక ముందుకీ ఒక్కోప్పుడు వెనక్కీ నడుస్తూంటాయిట. అవి రాగూడని చోటికొచ్చాయో యావన్మందికీ చెరుపే. వీడూ వాడూ అన్న విచక్షణ వుండదు. ఓః, భూకంపాలేవిటి, సముద్రాలుపొంగి పడవలు మునిగిపోవడవేవిటి, పడవల్లో వాళ్ళు అలో లక్ష్మణా అంటూ తెప్పకొయ్యలూ, తెరచాపలూ పట్టుకొని సముద్రంలోపడి, దాకి తెన్నూ తెలీకుండానున్నా కొట్టుకు పోవడవేవిటి, ఇల్లు ఉన్న పళంగా గభాల్న కూలిపోయి

ఇంటిల్లిపాదీ దానడుగున నలిగి చచ్చిపోవడమేమిటి, ఎన్న యినా భయోత్పాతాలు జరుగుతాయి. వచ్చే మాసం రాబోయే నవగ్రహ కూటం వుంది చూశూ. ఎన్నడూ కనీ వినని. ఉత్తినే రైళ్ళు పడిపోవడాలూ, ఇళ్ళు కూలిపోవ డాలూ, తుఫానువచ్చి వేలాది జననష్టం కలుగుతోంది గదా. ఈ నవగ్రహ కూటమెలా వుండబోతుందో వూహించుకో! అసలే బిడ్డకలిగిన నక్షత్రం శాంతి నక్షత్రమంటున్నారాయిరి. మనం పట్నానికి నలభై మైళ్ళలోపున ఉండడం ప్రమాదం. మనం శారసాలకు పోదాం. పోయి, ఈ గ్రహకూటం దాటి పోయిందాకా అక్కడే వుండిపోదాం. రాకరాకొచ్చావని వియ్యాలవారు సంతోషిస్తారు. సోవిదేవి సంగతి చెప్పే అక్కర్లేదు. ఒకపూట వియ్యాలవారింటా, ఓ పూట సోవి దేవింటా, ఓ పూట వారింటా, ఓ పూట వీరింటా—మంచి ఆలోచనే చేశానని నువ్వొప్పుకు తీరాలి"

"మీరాలోచన చెయ్యడవూ, అది మంచిది కాక పోవడవూనా?" అన్నది రావమ్మ ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

## 7

'వచ్చేశాం!' అన్నాడు సీతప్ప వియ్యాలవారింట అడుగు పెడుతూనే.

'ఎందుకూ?' అన్నారు సత్యం మావగారు సీతాపతి గారు.

'ఇవాళేగదూ శారసాలా, శాంతీ గట్రా——?' అన్నాడు సీతప్ప బిత్తరపోయి,

'శాంతి వద్దన్నారుగా? ఆ ప్రయత్నవే మానుకున్నాం' అన్నాడు సీతాపతి.

'ప్రయత్నవే మానుకున్నారా? చెడ్డ నక్షత్రవన్నారు?' అని సీతప్ప అడిగాడు.

'మాకు నక్షత్రాల పట్టింపులూ అవీ లేవు. మాదంతా బ్రహ్మసమాజం పద్ధతి గదూ? మీారే మూఢత్వం కొద్దీ అలాటివి జరిపించి తీరాలంటూ రేమోనని ఓ కార్డు ముక్క రాసి పడేశాను. మీా జవాబు చూడగా మీా కవేవీ పట్ట నట్టు కనబడింది. మరీ మంచిది లెమ్మనుకున్నాం.'

సీతప్ప గుండెల్లో ప్రళయం ఆరంభ మయింది. పరిస్థితి ఇలా విషమించి పోతుందని సీతప్ప కల్లోగూడా ఊహించ లేదు. బ్రాహ్మలు చెప్పేదానికన్న దానాలూ అవీ మరో నయాపైసా హెచ్చుగానే ఇద్దావటాని శాంకిలోంచి ఆరు వందలుతీసి భార్యను వెంటబెట్టుకుని చక్కా వచ్చాడు. కాని ఏం ప్రయోజనం? శాంతిలేదు సరేగదా, శారసాలా నామ కరణవూ లేదు; గుమ్మాలకి పసుపు కుంకాల్లేవు. అధమం ఓ మావిడిమండైనా కట్టారుగాదు! ఇది నాస్తికత్వమనుకోవాలో, పచ్చి కమ్యూనిజ మనుకోవాలో సీతప్పకి బోధపడిందికాదు. చాలా కాలంగా తనని ఏదో దుష్టగ్రహం వేపుకు తింటూం

దన్న అనుమానం మరింత రూఢి అయింది. ఏం చెయ్య బోయినా పొద్దెదురవుతూంటే ఎలా యీడవడం?

'పోనీ ఇప్పుడు శాంతికి ఏర్పాట్లు చేస్తేనో,' అన్నాడు సీతప్ప.

'మీకు సాధ్యవయ్యేట్టుంటే మహారాజులా చేయించండి. వ్యవధిలేకుండా ఏర్పాట్లు చూడ్డం నావల్ల అయ్యేపని గాదు. అయినా మీరు మీ ఆలోచన మళ్ళీ ఎందుకు మార్చేసుకున్నారో నా కర్థవవకుండా వుంది.' అన్నాడు సీతాపతి.

సీతప్ప ఒక్క గుటకవేసి ఊరుకున్నాడు. ఏవనడానికీ ఏం చెయ్యడానికీ ఆయనకు పాలుబోకుండా వచ్చి కూచుంది...

రావమ్మను చూస్తూనే ఇంటి ఆడవాళ్ళు, 'వచ్చారా? రావనుకున్నావే?' అన్నారు. సీతారత్నం అత్తగారిని పలకరించనైనా లేదు. బాలింతరాలంటే ఎంతో కళగా, నవ నవలాడుతూండాలి, ఏకళా లేదు స్నానవయిందిగాబోలు, జుట్టుకు ధూపం వేసుకుంటోంది.

రావమ్మగారు, 'మనవరాలేదీ ? నా కూతురూ డా చూపరూ?' అన్నదాకా ఎవరూ కదల్లేదు.

'శాంతంటే మాకు నమ్మకం లేదన్నారు. నామకరణ మైనా చేసుకోవడం లేదేం?' అన్నది రావమ్మ.

'అది పుట్టకముందే ఆడపిల్ల అవుతుందని మా నరసు చెప్పేశాడు. దానికి ఆవా అని పేరెట్టేశాడుకూడాను' అన్నారు వాళ్ళు.

'బొడ్డూడని పిల్లకి అవ్వాని ఎవరేనా పేరెట్టుకుంటారా?' అన్నది రావమ్మ విస్తుపోయి, చెయ్యితిప్పి గడ్డం కింద సపోర్టు పెట్టుకుంటూ.

'అవ్వ కాదు. అవా గార్డనరు—మా అన్నకి అభిమాన హాలీవుడ్ తార. చాలా అందంగా వుంటుంది. ఎన్నో లక్షల మంది ఆవిడకి రోజూ ప్రేమలేఖలు రాస్తూంటార్ట. ఉన్న మొగుణ్ణి వదిలేసి మమ్మల్ని పెళ్ళి చేసుకోమని కోటీశ్వరులు అడుగుతూంటార్ట." అని సీతారత్నం అత్తగారికి వివరించి చెప్పింది.

రావమ్మకు వాంతి అయినంతపని అయింది. అలాంటి మనిషిపేరా బిడ్డకి పెట్టుకునేది? ఏ పతివ్రత పేరో, దేవుడి పేరో పెట్టుకోక!

ఆమె కక్కడ ముళ్ళమీద ఉన్నట్టుండి ఎదురుగా వున్న సావిదేవిని చూడటాని కెళ్ళింది.

తల్లిని చూడగానే సావిదేవి మొగం విప్పారింది.

'వచ్చావా, అమ్మా? నాన్నకూడా వచ్చాడా? మీ రావడంలేదని చెప్పరూ?... సరేగాని శాంతి వొద్దన్నారటేవిటీ? ఎక్కడేనాకద్దా? అంత పాడునక్షత్ర మన్నప్పుడు శాంతి చేసుకోరూ? నాన్న ఇలాగంటాడని నేను కల్లోకూడా అనుకోలేదుస్మీ' అన్నది సావిదేవి.

'దానికంతా వుందిలే. ఆయన శాంతొద్దని రాయు లేదు. అలా ఒక్కనాటికీ రాయరు. శాంతిఖర్చులు అయి దొందలవుతాయి అచ్చుకోమంటే, అంతడబ్బు లేదు, కొంత మీరుకూడా భరించం డవటాని రాసుంటారు. పోనీగాని

చిత్తుగాడేడీ? అల్లుడుగారు కులాసాయేగదా? పార్వతికి మళ్ళీ యేమైనా——?'

'ఏంలేదు. పాపం ఆవిడికి సంతానరేఖ ఉన్నట్టు కన బడదు' అంటూ సావిదేవి నిట్టూర్చింది. అంతలోనే గొంతు మార్చి, 'చిత్తుగాడు బడికెళ్ళిపోయాడు. వాడింటో క్షణం వుండడు. ఊరంతా వాడికి నేస్తాలేనూ!' అన్నది.

'వాడి దారేవేరు' అన్నది తల్లి.

వాళ్ళు మాట్లాడుకుంటూండగానే సీతప్ప వచ్చాడు.

సీతాపతి వాళ్ళింటిలో వాళ్ళంతా అగోరకం మనుషు లనీ, సత్యాన్ని ఏవంత మర్యాదగా చూట్టంలేదనీ, వాడ స్త మానమూ ఆ ప్రెస్సులో పడుండి అడవా చాకిరీ చేస్తున్నా డనీ, రాత్రింబవళ్ళు విధీ విరామవూ వుండడంలేదనీ సావి దేవి తల్లి దండ్రులతో మాటసందర్భంగా అన్నది.

కాని సీతప్ప అదంతా కొట్టవతల పారేశాడు.

'వాడిప్పుడు వాళ్ళలో మనిషేనూ. అలాటప్పుడు మర్యాదేవిటీ? ఆత్మీయతా, ఆప్యాయతా ముఖ్యంగానీ! ఏనంటావూ? సొంతపనేగదూ? మనపని మనం చూసుకోక పోతే మరెవరు చూస్తారూ? ఇంట్లో గమ్మత్తు చూశావూ? మనవాడలా అహోరాత్రులు, అన్నాహారాలులేక, ఎండ నక, వాననక, చెమటోడ్చి పరిశ్రమించడంవల్ల అత్తవారికి వాడంటే వల్లమాలిన అభిమానవూ అదీ పుట్టుకొస్తుంది. వాడోపూట ఖాయిలా పడ్డాడనుకో, చెయ్యివిరిగినట్టయి పోతుంది. ఏవిటనుకున్నా వేవిటోనూ!... ఆ సంగతి వది లేయ్! ఇప్పుడసలు ఉపద్రం పట్నానికొచ్చింది. నువ్వినే

వుంటావు. పేద్ద ఉప్పెనొచ్చేసి పట్నం చుట్టూతానున్నా ముప్పైఫ్ఫె నలభై మైళ్ళ మేర ముంచెత్తేస్తుందిట. వెయ్యి నిలువుల నీరు ఇరవై నాలుఘ్ఘుంటల పాటలా నిలిచిఉండి పోతుందిట. ఇళ్లు కూలిపోవడవేవిటి, ఊపిరాడక మనుషులు చచ్చిపోవడవేవిటి అడక్కుమరి! దారుణం... వీళ్ళింకా తెలుసుకోకుండా ఉన్నారు. వెయ్యినిలువుల ఉప్పునీరొచ్చేస్తే గరిక్కూడా చచ్చూరుకుంటుంది. పట్నంచుట్టూ ముప్పైఫ్ఫెమైళ్ళ మేర యెడారై పోతుందంటే నమ్ము... ఇంకో గమ్మత్తు చూశావా? ఆ యెడారి గజం పావలాకిమ్మన్నా ఇచ్చేస్తారు. ఓ రెండెకరాలుకొని ధరలు పెరిగాక ఇళ్ళస్థలాల కింద అమ్మేద్దావవటాని అమ్మ ఆలోచనచేసింది. అలాగే చేద్దాంగాని ముందు ఈ ప్రళయంనుంచి ప్రాణాలతో బయటపడనీ అన్నా. పారిపోయొచ్చేశావంటే నమ్మిందే!"

సావిదేవికి ఒక్కటే అనుమానం వచ్చింది.

"ఈ జల ప్రళయం గురించి ఇక్కడకూడా తెగ చెప్పుకుంటున్నారు. కాని వెయ్యడుగుల నీరొస్తుందని మాత్రవే అంటున్నారే?" అన్నదామె.

"వె_య్యడుగులా? ఇంకానయిం! వె_య్యడుగులయితే చెప్పుకోడం దేనికీ? వెయ్యిని_లు_వు_లు!" అన్నాడు సీతప్ప కళ్ళు పెద్దవి చేసి. ఆయనకు యెక్కడలేని కవిత్వమూ పుట్టుకొచ్చేసింది. జరిగిన సంఘటనలు కళ్ళారా చూసినవాడు వర్ణించిన విధంగా ఆయన జరగబోయె జలప్రళయ భీభత్సాన్ని కూతురికి వర్ణించి చెప్పాడు.

మాటల సందడిలో సీతప్పకి కాలం ఎలా గడిచిందీ

తెలియలేదు. "గనకనున్నా, మేం జేసిన ఆలోచన ఏవి టంటేనున్నా, ఎలాగో ఇల్లుకదిలి రానేవచ్చేశావా, చెప్పాల్లో ప్రయాణం బెట్టుకునివస్తే అటు వియ్యాలవారూ ఒప్పరు, మీ ఆయనా ఒప్పడు, ఇదేవిటి ? ఇప్పుడొచ్చి ఇప్పుడే వెళ్ళిపోవడవా, వల్లగాదవటాంటారు. తప్పవిడిచి మరొహాటుండబోదు. అంచేతను నాల్రోజులిక్కడా, మరో నాల్రోజులక్కడా సరదాగా ఉండిపోయి, యేకంగా జలప్రళ యం తీశాక తిరిగిపోవడానికి నిశ్చయించుకు చక్కావచ్చాం — చెప్పొద్దూ? నెల్రోజులు సెలవడిగేశాను. నే సెలవు తీసుకుని ఏళ్ళయిందంటే నమ్మ. మా ఆఫీసులో మిగిలిన వాళ్ళంతా తద్దినాలనీ, ఊరికెళ్ళాలనీ, అక్కరొచ్చిందనీ చీటికీ మాటికీ సెలవుచీట్లు పంపిస్తూంటారు. నేనలా ఎన్నడూ చెయ్యను. యెంకుకడగాలి, యెందుకు లేదనిపించుకోవాలి ? శరీరం అమ్ముకున్నాక పనిచెయ్యవలిసిందే. పనంటే పనేనూ!రోట్లో తలదూర్చి రోకటి పోటుకు జంకితే ఎలా?ఎన్నడూ సెలవడిగి యెరగనేవో, అడగ్గానే గ్రాంటుచేసి పారేశారు. చక్కా వచ్చాం. రాకరాకొచ్చి నాల్రోజులైనా కళ్ళెదుటుండకుండా వెళ్ళిపోతే మీరంతా ఏవనుకుంటారూ? అంచేత పది రోజు లుండటానికే కట్టుదిట్టంవై మరీ వచ్చావనుకో!" అని సీతప్ప అంటుండగా ఫ్యాక్టరీలు కూశాయి.

"అమ్మయ్యో!అప్పుడే పన్నెండే?ఏవేవ్, వేగిరం! వేగి రం!అవతల పెద్దమనుషులు మనకోసం ఆపోశన పట్టకుండాకని పెట్టుక్కూచునుంటారు. పద పద" అని సీతప్ప భార్యను తొందరచేశాడు.

కాని సీతాపతిగారింట్లో భోజనాలెప్పుడో అయి పోయాయి. ఆసంగతి తెలీక సీతప్ప తన వియ్యంకుణ్ణిచూసి, "ఈ బ్రాహ్మడింకా భోజనం చేసే యత్నంలో లేడేవిటి చెప్మా?" అనుకున్నాడు.

రావమ్మని వియ్యపరాలు మాత్రం "మీ సోవిదేవి గారింట ఈపూట వంటకాలేవిటో?" అనడిగింది.

"తెలీదుస్మండీ, అడిగాను కాను" అన్నది రావమ్మ గారు.

"మీరింకా భోజనాలే చెయ్యలేదూ? ఎంతకీ రాక పోతే అక్కడే భోంచేశారనుకున్నాం."

కడిగిన వంటిల్లుచితచితలాడుతోంది.వంటకాలు చప్ప చల్లారిపోయాయి. సీతప్ప నాలుగు మెతుకులు నోట వేసుకున్నాననిపించాడేగాని ముద్దదిగడం చాలా కష్టమై పోయింది. రావమ్మగారు తినొచ్చేసరికి కూర మిగల్లేదు. మజ్జిగ గట్టిగా రెండుచెంచాలు మిగిలింది.

ఆ పుణ్యదంపతులు భుక్తాయాసంలేని భోజనంచేసి బయటి అరుగుమీద చేరారు. 'కాస్సేపు నడుం వాలుస్తారా ఏవిటి?' అన్నవారుగాని, ఓమంచంవేసి మర్యాద చేసిన వారుగాని లేరు.

'తప్పు పట్టడానిక్కాదుగాని,వీరిమాటతీరూ, మర్యాద తీరూ అదోమోస్తరుసుమండీ: ఇప్పుడేం? అబ్బిపెళ్ళినాడే ఈ సంగతి గమనించా," అన్నది రావమ్మ.

"నేనొక్కటే చెబుతున్నా చూడూ. మనం అలాటివేవీ పెట్టుకోకూడదు. మనసంగతి చంద్రమతీ హరిశ్చంద్రులవంతు అయింది. ఇల్లూవాకిలీ విడిచివచ్చేశాం. మనచూరుకింద మనం నిలబడే యోగ్యత లేకుండా చేసేశాయి నవగ్రహాలు నవగ్రహ జపవూ గట్రా అవుతుంది గదా అనుకుంటే ఇక్కడ అసలు శాంతే జరగలేదు. అంచేత మనని ఈగ్రహాలు ఓపట్టాన వదిలిపెట్టవు. మనవా, ఇవాళొచ్చి రేపెళ్ళిపోతున్న వాళ్ళం కాకపోతివి. ప్రళయం జరిగిపోయి, కలియుగం ముగిసి మళ్ళా కృతయుగం ఆరంభమయ్యే వరకూనున్నా ఇక్కడే ఉండిపోతున్నాం. అలాటప్పుడు మాటలనీ, మర్యాదలనీ పెట్టుకూర్చుంటే అవుతుందా? కలిపీడితులైన నల దమయంతులను ఆ మహారణ్యంలో ఎవరు మర్యాద చేశారు? ఏవిటో మనం వారికన్న లక్షరెట్లు నయమనుకో-లక్షరెట్లు:" అన్నాడు సీతప్ప తలకింద చెయ్యిపెట్టుకుని పడుకుంటూను.

రావమ్మ మాత్రం గోడకి చేరగిలబడి కూచుని, "ఇదేం ప్రయాణం! ఇదేంకథ! కోడలు నీళ్ళాడింది చంటి బిడ్డను చేతిలో పెట్టి ముచ్చటలు పలికిన వాళ్ళు లేరు. కొడుకింతవరకు కంటికే కనిపించ లేదు. ఎప్పుడనగా వెళ్ళాడో, ఎక్కడ అన్నం తిన్నాడో? బారసాల లేదు, పాడూ లేదు. నిన్నంటే నిన్నపుట్టిన బిడ్డకి అవ్వ అని పేరెట్టారట. చూడగా అంతా కలలా ఉందిగాని నిజంలాగా లేదు...గోదావరి నీరు పట్నం నీరులా కాదు. ఆ కలి కరకర లాడుతుంది గాబోలు..." అనుకుంటూ కూచునే కునుకులు పడింది.

# 8

సీమంతం ఘట్టుగా జరిగింది. సోమిదేవీ, చిత్తుగాడూ వచ్చారు. రోజల్లా ఉన్నారు. ఎదురు వాకిలే అయినప్పటికీ నున్నా అల్లుడు భద్రాచలం తొంగి చూశాడు కాడవటాని సీతప్పగారు శాస్త్ర యిదయ్యాడు.

"పార్వతి అయినా వొచ్చుండవలసింది. పరాయిదా యేవిటి ?" అన్నది రావమ్మ. తన కూతురి సవితి గురించి.

"ఇదుగో, నే చెబుతున్నా వినూ. ఎవరిష్టం వారిదీ. ఒహరు చెప్పినట్టొహరు వినే రోజులు పోయాయి. అబ్బో, మా చిన్నతనంలోనా ? పెద్దవాళ్ళు కూచోమంటే కూచోవలసింది, నుంచోమంటే నుంచోవలసిందే. పకడ్బందీ అంతా కామోష్! ఆఁ!" అన్నాడు సీతప్ప కళ్ళు పెద్దవిజేసి.

మరొకందుకు కూడా సీతప్ప ఆనందం వెలిబుచ్చారు. సత్యం బావమరది నరుసు సరిగ్గా నెలంటేనెలకిందటే ప్రెస్సు కూడా పెట్టేశాట్ట. ఈ మాట వింటూనే సీతప్ప వియ్యంకుడైన సీతాపతిగారితో, "యేవిటీ ? చెప్పారుకారేం? మీవాడి పుస్తకాలు అచ్చువేసుకుందుకేనా ? ఆ బిజినెస్ బాగా సాగుతోంది గదా ! మరి ప్రెస్సుతోబాటు కంపోజిటర్లనూ, ప్రింటర్లనూ కూడా ఏర్పాటు చేసుకున్నారు గదా! మరి హానేం? అంతా సవ్యంగానే వెళ్ళమారిపోతుంది. పుస్తకాలు ఇలా అచ్చేస్తూండడమూ, అలా మార్కెట్టుకు తోలేస్తూండట

మునూ, దొంతర్లు, దొంతర్లు ! ఊపిరి సలపదు ! విసుగూ విరామవూ వుండదనుకోండీ ! నే చెప్పాగా ! అబ్బ !" అన్నాడు.

"ప్రెస్సు సౌకర్యంకోసం పెట్టడమే గాని, అందులో మనకు చాలా–" అని సీతాపతిగా రన్నాడు.

"మెల్లిగా అంటారేవిటి ? సౌకర్యవా, సౌకర్యవా, అడక్కండి ! ఇహ బండి మీరాపినా ఆగదు. అసలు మా సత్తేం మీ ఇంటో అడుగు పెట్టడమే వ్యవధిగా సిరెత్తుకుం దనుకోండి. అప్పుడే గాదూ మీవాడు పుస్తకాల బిజినెసు పెడతా ? ఇప్పుడు ఓ నలుసు కడుపున పడిందో లేదో ప్రెస్ పెట్టేశారు! ఇంకేవుందీ ? రేపా నలుసు బయటికి వచ్చాక చూడండి, అసలైన దశ అందుకుంటుంది. మీరే ఆశ్చర్య పోతారు. ఇంత అదృష్టం ఎలా వచ్చింది చెప్మా అని !"

సీతప్ప ఒక్క అరసెకండు కాలంలో తమ వంశచరిత్ర అంతా పర్యాలోకన చేసి చూసుకున్నాడు. అత్తవార్లకి అదృష్టం పట్టించే ఆనవాయితీ తమ వంశంలో నేఉందని రుజూ చెయ్యడానికేమన్నా ఆధారాలు దొరుకుతాయా అని. అయితే ఈ ప్రయత్నానికి అడుగులోనే హంసపాదు పడింది. సీతప్ప పెళ్ళయిన పదహారో రోజు పండగనాడు ఆయన మామగారు హరీ అన్నాడు—సత్యం పుట్టిన మూడోనాడు ఆ మిగిలిన ముసలావిడ ప్రాణం కూడా గుటుక్కుమనేసింది. "ఛస్!" అనుకుని సీతప్ప ఆ ఆలోచనకి ఆనకట్ట వేసేశాడు.

సత్యం తల్లితో రహస్యంగా చెప్పాడు. "చూడమ్మా

దానికడుపైతే తిరపతి వెళతానని మొక్కుకున్నాను. ఈ మాట దాంతో అంటే నవ్వి వేళాకోళం చేసింది. ఆ మొక్కు తీరే దెలాగమ్మా !"

"మా నాయినే! నా తండ్రే! మీ నాన్నారితో చెప్పి ఏదో ఉపాయం చేయిస్తాలే;" అన్నది రావమ్మ.

ఆవిడ ఈ మాట రహస్యంగా సీతప్ప చెవిని వేసింది. సీతప్ప దారుణమైన వార్త విన్నవాడల్లే "హయ్యో!హయ్యో! మొక్కేసుకున్నావా ? అలాటి పని చేసేప్పుడు కాస్త వెనకా ముందు ఆలోచించుకు మరీ చెయ్యాలి. పత్రంమీద సంతకం పెట్టాలంటే పదిసార్లు పైకీ, కిందికీ పారచదువుతాం గదా... అందులోనూ ఇది దేవుడితో సంబంధించిన విషయమే తప్ప విడిచి మరొహటీ మరొహటీ కాదు కూడా నాయిరి! దేవుడి మన స్తత్వం ఎలాటిదంటే—— మొక్కేకు ! గమ్మనుండిపో! నిన్నేమీ అనడు. కాదని మొక్కున్నావూ ? నీవెంట బడతాడు, నిన్ను వొదల్డు మొక్కు చెల్లించేదాకానున్నూ! నేను రామకోటి ప్రారంభించానా? రాసుకుపోవలసిందేనూ! పోసిలే మానేస్తాం అనుకునేటందుకు వీల్లేదు. అది అయేపని కాదంతే!" అనే ధోరణిలో పడిపోయి అసలు సంగతి మరిచాడు.

"ఇప్పుడబ్బిగాడేం చేసేట్టూ" అన్నది రావమ్మ.

"నువ్వు కంగారుపడకు ! నేనంతా సరిచేసేస్తాను."

సీతప్ప దీర్ఘంగా ఆలోచించి, "వియ్యంకుడుగారితో చెబితేనో ?" అన్నాడు.

రావమ్మ అటుచూసి గొంతు తగ్గించి, "వీళ్ళంతా వొట్టి రాలుగాయలు సుమండీ! ఒక దేవుడూ దైవమూ లేదు! ఒక మడీ; ఆచారమూ లేదు! అడక్కండి?" అన్నది.

"అదా సంగతి... పోనీ మనవెంట కోడల్ని తీసికెళ్ళి నాల్రోజులపాటు అట్టే పెట్టుకుంటావందాం. పట్నంనుంచి తిరుపతనగా యెంత? బస్సులు కొల్లలు కొల్లలు! వచ్చే బస్సూ పోయే బస్సున్నూ. ఇక్కడెక్కడం, అక్కడ వాలడమూను.

రావమ్మ మొహం చాటంతయింది. .

"మంచి ఆలోచన చెప్పారండీ. రెండేళ్ళయి కోడల్ని తీసుకురాకనే పోతిమి. అందరూ వింతగా అడుగుతున్నారు. ఈ పంజే స్తివాం. కోడల్ని తీసుకొచ్చినట్టూ అవుతుంది. అలా వెళ్ళి ఆ కాస్త మొక్కూ తీర్చేసుకున్నట్టూ అవుతుంది. దివ్యమైన ఉపాయంలెండి మరి!

భార్య తనను అంతగా మెచ్చుకున్నందుకు సీతప్ప పరవశుడైపోయాడు. "ఈ భాగ్యానికేనా?" అన్న మొహం పెట్టి, కీడెంచి, మేలెంచేవాడి వాలకంతో. "అప్పుడే సంతోషించకు మరి! మనం అడగ్గానే వారు పంపుతారనేవిటీ? వారికిన్నీ ఇద్దరు కుమార్తెల తరువాత ఒకే ఒక కూతురాయిరి! అందులోనూ మూలాలూ! ఇప్పుడుగాదు లెండి. అవతల చూస్తాం ఆవటాని మాట తప్పించేశారో మన పని ఖాళీయే. వారిని ఒప్పించే వాడుపూ, చాకచక్యమూ నీలో వుంది! ఆఁ!" అన్నాడు.

"నేను అడగవలసిన విధంగానే అడుగుతాననుకోండి. అయినా మన సోమిదేవి చేతకూడా చెప్పించి చూస్తానూ ! వీరి దగ్గిర అమ్మికి ఎంతో చనువు. అదేగదటండీ అబ్బిగాడికీ సమ్మంధం కుదిర్చి పెళ్ళి చేయిస్తా. సీతారత్తంమాటచెప్పే అక్కర్లేదూ!సోమిదేవి కూచోమంటే కూచుంటుంది.నుంచోమంటే నుంచుంటుంది.మన కోడలికి రావాలనే ఇచ్ఛకలిగాక పెద్దవాళ్ళు అడ్డుపుల్లేస్తా రనుకోనుస్మండీ !...... అన్నట్టు అమ్మినీ, చిత్తుగాణ్ణీ కూడా తోలుకుపోదాంవా ఏమిటి, పన్లో పనిగా ?" అన్నది.

సీతప్ప బెదురుగొడ్డలే అయిపోయి నోరు నొక్కుకుని, "ఇంకా నయం ! ఇప్పుడున్న పరిస్థితిలో దాన్ని ఆ యింటి గడప దాటి యివతలకి రానియ్యడవా? నా మొదటి భార్య పిల్లడితో లేచిపోయింది. అని భద్రాచలం కోర్టులో చిన్న కాగితం ముక్క పడేశాడంటే దానికి పుట్టగతులుంటాయా? ఈ పదేళ్ళనుంచీ దాన్ని పిలిచి ఇంత కుంకుం బొట్టయినా పెట్టాం కాం గదా! ఆపేక్ష లేకేనా ? నీ కీ ఆలోచన రావవమే పొరపాటు. అందుకేగా స్త్రీ బుద్ధి ప్రళయాంతకం అన్నారు" అన్నాడు.

రావమ్మ తప్పు గ్రహించి తన సవరణ ఉపసంహారించేసుకుంది.

ఆ పుణ్య దంపతులు ఉత్తినే కంగారు పడ్డారుగాని, రావమ్మ అడగానే వియ్యాలవారు, "ఓ మీ కోడల్ని మీరు మహారాజులా తీసుకుపొండి. నాల్రోజు లుంచుకుని మళ్ళీ పంపెయ్యండి" అన్నారు.

# 9 .

సీతారత్నం సెంట్రలు స్టేషను బయటికి వస్తూనే ఒక కన్ను జనరల్ ఆస్పత్రికేసీ, ఇంకో కన్ను రిప్పన్ బిల్డింగ్ కేసీ వేసి, "ఇదేనా మెడ్రాసు? ఏం ఊరు, పాడూరు! పేరు గొప్ప, ఊరు దిబ్బానూ!" అనేసింది.

అత్తవారి గడపదాటి లోపలి కడుగు పెడుతూనే, "ఏం కొంప? పాడు కొంప!" అనేసింది. తమిళ భాషను, "ఏం భాష? పాడు భాష!" అని దీవించింది. అన్నిటికీ సత్యం అవునన్నాడు. సీతారత్నం తన మామగార్ని "ఏం మనిషి? పాడు మనిషి!" అని పైకి అనలేదుగాని లోపల అనుకున్నది.

రైల్లోనూ, రైలు దిగి ఇంటికి వచ్చేటప్పుడు పెద్ద టాక్సీలోనూ సీతప్ప చెవికోసిన నక్కలాగా మాట్లాడుతూనే ఉన్నాడు. కాని ఆయన ఏవంటున్నాడో, ఎందుకంటు న్నాడో సీతారత్నానికి చచ్చినా బోధపళ్ళేదు.

"పట్నం నిండా వట్టి రౌడీ వెధవలు! ఒంటరి పిల్ల కనిపిస్తే చాలు ఎగరేసుకు చక్కా పోతారు. యీ డొచ్చిన ఆడపిల్లలు పట్టపగలు గూడా ఒంటిగా పోభయం. రిక్షావాళ్ళకి డబ్బిచ్చేసి, 'అబ్బీ, నదరైన పిల్ల నీ రిక్షాలో ఎక్కిందో తిన్నగా మనింటికి పట్టుకొచ్చేసెయ్యి!' అని చెప్పుంచుతారు. వాళ్ళ క స్సమానం అదే యావాయిరి. కాని కొందరు పిల్లలు సాహసం గలవాళ్లుంటారు. కనిపెట్టేస్తారు. తిన్నగా లైజ్ కేసి

పోవలసినవాడు ఇలా కెనెడీ వీధికేసి రిక్షా తిప్పాడేవిటి చెప్మా అనుకుంటారు. అనుకుని ఆపళంగా, 'ఒరే,ఇటుగాదు!తిన్నగా రిక్షా తోలు! వెర్రిమొర్రి వేషాలేశావో పెణత ఊడిపోగల్దు' అవటానేస్తారు. దాంతో రిక్షావాడు దాగికొస్తాడూ సరేసరి, లేదూ ఆపళంగా కాలి జోడూడదీసి నాలుగుచ్చుకుంటారు. ఆ పళంగా నలుగురూ పోగవుతారు. ఆ పళంగా రిక్షావాడికి మరి నాలుగు తగుల్తాయి. అమ్మో!... అప్పుడే వెల్లింగ్టను కొచ్చేశామూ ? వేగిరం, వేగిరం!...పట్నంలో అన్ని సౌకర్యాలూ ఉన్నాయన్న మాటేగాని ఏ సౌకర్యమూ లేనట్టే. అవును మరి, వెలుగుండేచోటే నీడా ఉంటుంది. కష్టసుఖాలు కావడి కుండలని ఊరికే అన్నారా? ఓడలు బళ్ళౌ, బళ్ళు ఓడలూనాయిరి. చెప్పొచ్చిందేవంటే, ఎలట్రిసిటీ ఉందా? ఉన్నట్టుండి గభాల్న దీపాలారిపోతాయి. ఎంతకీ రావు. మీా అత్తయ్య అన్నం వొండుతూ ఉంటుంది. ఉడుకెందాకా వచ్చిందీ తెలీదు. ఎలెట్రిసిటీ ఉందిగదావటాని కిరసనాయిలు దీపాలు లేకుండా చేసేసుకుంటాం. నా చిన్నప్పుడు మా అమ్మమ్మగారింట ఆవదం దీపాలు. ఒకవేళ దారితప్పి దీపం ఆరిపోయినా అంత చీకటనిపించేది కాదు. ఎంచేతా? ఆవదం దీపంది అసలే గుడ్డి వెలుగు, కాని ఇప్పుడీ ఎలెట్రీ దీపాలు కళ్ళు జిగేల్మనేలా వెలుగుతాయేం ? అవి ఆరిపోయేసరికి కన్ను పోయినంతలా ఉంటుంది. ఏవీ కనిపించదన్కో. అందుకే, కష్టపడి సుఖపడు గాని సుఖపడి కష్టపడొద్దన్నారు. వచ్చేశావ్రోయ్! వేగిరం, వేగిరం !"

ఆహా, తన మామగారెంత లోకజ్ఞాని, ఎంత అనుభవజ్ఞుడు. అలాటి వాడింట్లో ఉంటే చిన్నవాళ్ళకెంత జ్ఞానవృద్ధి అని కోడలు అనుకోవాలని సీతప్ప ఆశయం; అనుకుంటున్నదని సీతప్ప నమ్మకం.

"అదేనోయ్ యిల్లూ! అల్ల ఆకుపచ్చ రంగు గేటుంది చూడూ, ఆ గేటుముందు నిలు!... ఓపలేం దానవు, కాస్త నింపాదిగ దిగమ్మా!" అన్నాడు సీతప్ప టాక్సీవాడితోనూ, కోడలితోనూ.

మావగారేవడు చెప్పటానికన్నట్టుగా సీతారత్నం పెద్ద అంగవేసి టాక్సీలోంచి ఏకంగా గేటు దగ్గిరికి దూకింది "ఆఁ ఆఁ!" అన్నాడు సీతప్ప.

టాక్సీ మీటరు నాలుగు రూపాయల నాలుగణాలయింది. "అమ్మబాబోయ్! మీటరులో తభావతు లేదుగదా? కిందటి సారి రెండు రూపాయల చిల్లరే అయినట్టు జ్ఞాపకమే" అన్నాడు సీతప్ప వణుకుతున్న చేత్తో సంచీ తీస్తూ.

తెలుగు రాకనో, ఈ పిచ్చి బ్రాహ్మణుడికి జవాబు చెప్పే దేవిట్లే అనో టాక్సీవాడు మాటా పలుకూ లేక, మీటరు మీద చెయ్యిపెట్టి ఓర్పుగా డబ్బుకోసం నిలబడ్డాడు.

"అది చిన్న టాక్సీలెండి," అన్నది రావమ్మగారు.

"అవునే వన్నట్టు!" అంటూ సీతప్ప ఆదరాబాదరా డబ్బులు తీసి టాక్సీవాడికిస్తూ, "ఎంతెంత డబ్బూ టాక్సీల కింద తగులడిపోతోంది! వేలూ లక్షలూ సంపాయించుగాక, టాక్సీ లెక్కావో నీ పని ఖాళీయే" అని గొణుక్కున్నాడు.

"గత్యంతరం లేదాయిరి ! ఇంత సామానుతో బస్సు వాళ్ళెక్కించుకోడు గదా! అప్పటికీ బయల్దేరేటప్పుడు చెప్పా, నాలుగు రోజులుండటానికి ఇన్ని పెట్టెలెందుకే మా తల్లీ ? ఒకటొ రెండు చీరెల్తెచ్చుకుంటే అంతగా అవసరం పడ్డప్పుడు నా చీరెలిస్తానూ అని! వింటిగాదు మరి," అన్నది రావమ్మ కోడల్ని గురించి.

అకస్మాత్తుగా కోడలు పిల్ల అగ్గయిపోయి, "ఛీ, ఛీ ! ఒకరి చీరె కట్టటం మాకు ఇంటా వంటా లేదు.మా అమ్మింది అక్కాయిలున్నారు. చచ్చి గీపెట్టినా పీక తెగ్గోసినా ఒకరి బట్ట లొకరు కట్టుకోం. అది యే బ్రాసివాళ్లు చేసే పని!నాకేం లొసుగూ? నాల్రోజు లుండటానికి నాలుగు పెట్టెలు తెచ్చు కుంటాను. నాకు అన్నీ అమరిగ్గా ఉండాలి; ఏది తక్కువైనా రెక్క పడిపోయినట్టవుతుంది. నన్నాట్టే రొకాయించకండి. చిర్రెత్తితే నే నసలు మంచిదాన్నిగాను !" అని దడా బడా అప్పగించేసింది.

ఇంకా వీధిగుమ్మందాటి లోపలికి వెళ్ళకముందే కోడ లిలా మూశో కన్ను విప్పడం చూసి సీతప్ప బెంబేలుపడి పోయాడు. రావమ్మ అవమానంతో మొహం కందగడ్డచేసు కున్నది. సత్యం నేలకేసి చూసి కుడిచేత్తో ఎడం చెవి నులుముకున్నాడు.

"ఎందుకీ నిలువు జీతం? తాళం తెరవండి. దూరభార ప్రయాణంచేసి ఒళ్ళంతా హూనమైపోయింది. ఉడుకు నీళ్ళో సుకుని నడుం వాలిస్తే తప్ప ప్రాణం కుదుటపడదు"అని సీతా రత్నం తొందర పెట్టింది.

పాపం, రావమ్మగారిని ఆటలో పెద్ద పాము కరచినట్టుగా అయిపోయింది. ఆవిడ ఇంతకాలమూ తన కోడలెలాటిదో ఎరగదు. ఎరగని మనిషి ఎరగనట్టూ యుక్లోక మనుషులు దేవుణ్ణి తమ రూపులో చిత్రించుకున్నవతుగా, తనక్కావలసిన లాంటి కోడల్ని ఊహించుకుంది. ఆ కోడలు ఆప్యాయంగా తన యింట కొన్నాళ్ళుండి—ఎల్లకాలం ఉండమంటే మాత్రం ఉంటారా ఏవిటి? "అత్తయ్యా, మీరు కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. చెయ్యవలసిన పనులేవో నేను తీర్చిదిద్దుతా గదూ? ఇంతకాలమూ తప్పలేదుగనక అంతా మీరే చేసుకుంటూ వచ్చారు. ఇప్పుడు మరి నేనంటూ ఒకతెనున్నాను గదా సమస్తోపచారాలూ చెయ్యడానికి!" అంటుందవటాని ఊహించుకుంది. కాని, సినిమాల్లో ఒక బొమ్మపోయి ఇంకో బొమ్మ వచ్చినట్టుగా తాననుకున్న కోడలు మాయమై ఇదేదో విచిత్రమైనమనిషి తయారయింది. ముచ్చటగా తనని "అత్తయ్యా" అనీ, ఆయన్ని "మావగారూ" అని నోటంట పిలిచిన పాపాన పోయిందే గాదు! తనని ఫెడీమని ప్రశ్నాసి అని ఆ పిల్ల అంటూంటే తన భర్త చక్రం అడ్డేస్తాడని రావమ్మగారు ఎంతో ఆశపడి ఆయనకేసి చూసినది. కాని సీతప్ప కంటిలో బెదురు చూడగానే ఆ ఆశకూడా అడుగంటిపోయింది.

ఇంతదాకా వచ్చాక ఇంకో అత్తగారైతే, "ఈ ముండని ఎలా రాచి రంపాన పెట్టడమా?" అన్న ఆలోచనలో పడేది. కాని సీతప్పగారి కుటుంబంలో అలాటి ఆనవాయితీ లేదు ఎవరైనా కరుకుగా ప్రవర్తిస్తే వారిని మెప్పించడానికి అష్ట

కష్టాలు పడడమే ఈ కుటుంబంవారికి తెలిసిన తారక మంత్రం.

సీతప్ప కూడా కోడలి మెప్పు సంపాదించే యత్నం లోనే ఉన్నట్టు త్వరలోనే తేలిపోయింది. రావమ్మగారు కాగు కింద రెండు కట్టెలు పెట్టి మండిస్తూంటే ఆయన దొడ్లోకి వచ్చి, "ఏమేవ్? వేగిరం, వేగిరం!" అన్నాడు.

అలవాటు చొప్పున రావమ్మ, "అయిపోయింది! అయి పోయింది!" అన్నది.

సీతప్ప కాగులో చెయ్యి పెట్టిచూసి, "ఏదీ ఇంకా గోరు వెచ్చలు కూడా కాలేదే?" అన్నాడు.

"అయ్యో, రామా! ఇప్పుడే గదండి నుంట చేస్తా ? కాగుడు నీళ్లూ ఇంతలోకే తెర్లిపోతాయూ? మరీ చోద్యం!" అన్నది.

"మరో రెండు కట్టెలు పెట్టకూడదూ ? నలుగురమూ స్నానం చెయ్యవలసిన వాళ్ళమే నాయిరీ! ఆ పిల్ల- అసలే ఓపలేని మనిషి— మనుళ్ళు కావాలంటుందాయిరీ ! మనకే ప్రయాణబ్బడలిక యింతగా ఉంటే ఆరోనెల గర్భిణి కింకెంత బడలిగ్గా ఉండొచ్చు."

రావమ్మ గొంతు తగ్గించి, "నెలలొచ్చిన మనిషిగదా ఉడుకునీళ్ళోసుకుంటాననటుం దేవిటండీ? మీరన్నా శాస్త్ర చెబుదురూ!" అన్నది.

"నువ్వూర్కో ! నీ కీ వైనాలు తెలీవు. మనం చెప్పే కూడదు. మాటవరసకి "అమ్మాయీ, ఉడుకునీళ్ళు ఉత్తప్పా

డైతే పోసుకుంటే పోసుకోగాక. ఈ స్థితిలో గర్భాన ఆరు నెలల పిల్లడుండగా అలాటి పన్లు చెయ్యరాదు. అది నీగ్గాని, నీ కడుపులో ఉండే పిల్లడిగ్గాని మంచిది గాదు!" అని మనం అన్నావన్నట్టాయినా, 'హాత్తెరీ, నన్ను తీసుకొచ్చి కోడంటికం పెట్టేస్తున్నారు; అవటానుకుంటుంది. నే నొక్కటే చెబుతా చూడు. జరగవలసిందేదో జరిగిపోనీ! అన్నిటికీ ఆ శ్రీరామచంద్రమూర్తే ఉన్నాడు. హరిశ్చంద్రాదులకి తప్ప లేదు___ ఏవిటో మంచేతుల్లో ఉందనుకొని తప్పుదారి పడి పోతున్నావు" అన్నాడు సీతప్ప.

"దారి తప్పి ఏదన్నా అయితే నలుగురూ మనని ఆడి పోస్తారేమోనని నా బెంగ. 'అది చిన్న పిల్ల. దానికేం తెలుస్తుంది. పెద్దవాళ్ళన్నా చెప్పొద్దా? అన్నమాట తప్పక పుడుతుంది."

"అదీ బొత్తిగా కొట్టివెయ్యవలసిన మాట కాదనుకో, అంచేత జపం జేద్దాం. అబ్బిని ఇసంటా పిల్చి వాణ్ణి చెప్పమను. ఎంత లేదన్నా మొగుడూ, పెళ్ళాం గదా!ఆ అన్యోన్యం మరొకరికి రమ్మంటే మాత్రం వస్తుందా,నీ పిచ్చిగాని" అన్నాడు సీతప్ప. భార్య అమాయకత్వాన్ని ఓర్పుతో సహిస్తున్నవాడల్లే.

# 10

“నాయినా, సత్యం ? నువ్వూ ఆయినా జపానికూర్చోండి. ఈలోపుగా చారు కూడా అయిపోతుంది. వడ్డించేస్తాను” రావమ్మగారు వంటింట్లోంచి కేక పెట్టింది.

“జపవా! హాహాహా!” అని సీతారత్నం కప్పు లేచిపోయేలా నవ్వింది.

“వచ్చె! వచ్చె! క్షణం!” అంటూ సీతప్ప రామకోటి కళ్ళ కద్దుకుని యథాస్థానంలో పెట్టేశాడు. ఆయన వంటింట్లో చేరి ఆచమనం చేసి కేశవ నామాలతో సంధ్యావందనం ప్రారంభించాడు. ఆయన ముక్కు పట్టుకోవడం మానేసి పక్కనున్న ఖాళీ పీట కేసి చూసి, “ఏడేడీ ? సంధ్యే వార్చడూ? ఎందు కాలెస్యం ?” అని భార్యను అడిగాడు.

కోడలన్న మాటలూ, నవ్వూ విన్న రావమ్మ మాట్లాడలేదు. ఆవిడ వడ్డించానన్న దాకా సత్యం గదిలోనుంచి ఇవతలికి రాలేదు. సత్యంతోబాటు సీతారత్నం కూడా వచ్చింది రెండే విస్తళ్ళు, రెండే పీటలూ వేసి ఉండటం చూసింది. సత్యం కేసి తిరిగి, “మీకు ఈపూట భోజనం లేదా ఏవిటి ?” అని సీతప్పగారి పక్కన ఉన్న పీటమీద కూచుంది.

సత్యం తల్లికేసి బిక్కమొహం వేసుకు చూశాడు. అందాకా కళ్ళు మూసుకు ఏకధ్యానం చేస్తున్న సీతప్ప కళ్ళు పెద్దవిగా తెరచి రావమ్మతో, “అలా చూస్తావేవిటే? అబ్బికి పీటా, విస్తరీ వెయ్యి!” అన్నాడు.

రావమ్మ గ్రహించింది కాని అసహాయురాలైపోయింది. ఇంట్లో మరో పీటచెక్క లేదు.

"మరో రెండు పీటలు చేయిద్దామనుకుంటూనే తాత్సారమైపోయింది" అన్నది రావమ్మ.

"ఛా, ఛా! పీటలకూడా కరువే? మా యింట్లో రెండు డజన్ల పీటలు. అయినా మా అబ్బాయికి పీటమీద కూచోడం అలవాట్లేదు. ఆయన పీటమీద కూచుంది పెళ్ళి పీటలమీదే," అన్నది సీతారత్నం.

"అవునమ్మా, నేను కిందే కూచుంటాను. నా కలవాటైపోయింది" అన్నాడు సత్యం. తల్లి ప్రాణం తల్లడిల్లిపోయింది—పిల్లడు పీట లేందే అన్నం తినేవాడు కాడు; అన్నప్రాసన చేసిన్నాడే వాడికోసం ఓ బుల్లి పీట చేయించారు. అది చాలకపోతే ఇంకొంచెం పెద్దదీ, అదీ చిన్నదైతే మరి కొంచెం పెద్దదీ; అలా పీటలు చేయిస్తూ వచ్చారు! అత్తారింట ఇన్నాళ్లూ వాడికి పీట వెయ్యలేదన్నమాట! ఎన్ని డజన్లు పీటలుండేం ? ఏడవనా?"

రావమ్మ తన భర్త కుడిచేతి పక్క మరో విస్తరి తెచ్చివేసి వడ్డన ఆరంభించబోయింది. కాని సత్యం విస్తరితో సహా లేచి తన భార్య ప్రక్కన చేరాడు.

"ఇప్పుడన్నా పసిగట్టేవా నీవు చేసిన పొరపాటు" అని సీతప్ప మందహాసంతో భార్యకేసి చూసి అన్నాడు.

"పొరపాటు జరిగే పోయిందా ? ఏమిటండీ అదీ ?"

"భార్యా భర్తల మధ్యని మరొరు కూచోవచ్చునటే, వెర్రిదానా ?" అన్నాడు సీతప్ప.

"నిజవేనన్నమాండీ ! నా తెలివి తెల్లారా !" అంటూ రావమ్మ వడ్డన ఆరంభించింది.

"ఛీ, ఛీ, ఛీ ! ఇదేం పచ్చడి ? కందిపచ్చడా ? ఇలా తగలేశా రేవిటీ ? మా ఇంట్లో ఇలా చేస్తే కుక్కలు కూడా ముట్టవు !... ఈ కూర ఇలా తగలడిం దేవిటీ ? మీ అబ్బాయికి నచ్చే వంటయి దేకాబోలు. మా తిఖ్యా, మావంటలూ ఆయనకు పట్టవు. ఇం చేతేనూ !... మా మామ్మ ఈ వంకాయ కూర వెల్లుల్లిపాయ వేసి చేస్తే గిన్నె నాకెయ్యవలిసిందే ! అంతబాగా చేసేది" అంటూ అన్నీ తోసేసి, రెండు నిమిషాలైనా విస్తరిముందు కూచోకుండానే చివాల్న లేచేసింది.

ఒక్కముద్ద తిని రెండోసారి కలుపుకోబోతున్న సత్యం కూడా విసట్లో చెయ్యి విదిలించి లేచాడు.

"హాయ్యో ! హాయ్యో !" అని రావమ్మ ఆర్తనాదం చేసింది

"నింపాదిగా ! నింపాదిగా !" అని సీతప్ప అనచాడు. ఆ మాటకు అర్థమేమిటో ఎవరికీ తెలియలేదు.

"ఆకలి మండిపోతుంది. తినడానికి లేదు. ప్లీజ్ ! ఏ హోటలు కన్నా పోయొద్దాం పదండి !" అని సీతారత్నం సత్యంతో అనటం వినపడింది.

వాళ్ళిద్దరూ, వెళ్ళాక రావమ్మ తన భర్తతో, "ఇదేం విడ్డూరవండీ ?" అన్నది.

"అదే పొరపాటు! నువ్వు తొందరపడకు! మరేం భయంలేదు. ఇలా మాట్లాడేవాళ్ళంతా విధిగా బోళావాళ్లు. అది రూలే అనుకో! దానికి మరి తిరుగులేదు. వాళ్ళ మన సెలా ఉంటుందో తెలుసా? వెన్న! వెన్నకంటె కూడా సున్నితం. మనం మంచిగా ఉంటే, వాళ్ళంత మంచివాళ్ళుండరు. ఈ కిటుకు అబ్బి కనిపెట్టేశాడు. దాన్ని నొప్పించకుండా ఉండటానికీ, మెప్పించటానికీ వాడెలా మసులుకుంటున్నాడో చూశావా? ఓర్పు! ఆఁ! మన కడుపున సామాన్యుడు పుట్టాడనుకున్నావుటే? సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రమూర్తే అవతరించాడు. ఆ రాముడిది ఏం వోర్పు! పితృవాక్య పరిపాలనా మరోటా? చీమలు దూరని చిట్టడవుల్లో, కాకులు దూరని కారడవుల్లో, ఓచెంప ఆ సీతామ్మవార్ని పంచప్రాణాలుగానునూ్నా రక్షించుకుంటూనునూ్నా, మరోవంక తమ్ముడు లక్ష్మణుడు ఎక్కడ కంది పోతాడో అని వెయ్యికళ్ళతో కాపాడుతూ, ఎదటపడ్డ రాక్షసుణ్ణల్లా-వధ!- నరికిపారేసుకుంటూ, పధ్నాలుగేళ్ళు అష్టకష్టాలు - ఓ నెలకాదు, ఓ ఏడాదిగాదు, పధ్నాలుగేళ్లు అష్టకష్టాలూ పడ్డాడంటే ఎంత వోర్పు. ఎంత వోర్పు!" అన్నాడు సీతప్ప. ఆయన ముఖాన చెమటలు దిగ్గారిపోతున్నాయి నడివేసవిలో లాగా.

రావమ్మ దీర్ఘంగా నిట్టూర్చి భర్తకు చారు వడ్డించింది.

# 11

"ఈపూట కోడలు వంటచేస్తుందటండోయ్!" అని రావమ్మ శుభవార్త చెవిని వేసేసరికి సీతప్పకు మబ్బులన్నీ విచ్చిపోయి, మళ్ళీ చాలా కాలానికి సూర్యదర్శనం అయినట్టయింది.

"అలాగా? చెప్పవేం? అయితేమరి అడిగేదేవిటి? ఈపూట మనకి విందు భోజనమేనన్నమాట!" అన్నాడు సీతప్ప పరమానందంతో.

సీతప్ప ఆనందానికీ సీతారత్నం పాకసిద్ధికీ ఏవీ సంబంధం లేదు. తన కోడలికి వంటచెయ్యొస్తుందనికూడా సీతప్పకు తెలీదు. కాని ఆ పిల్ల కిందటిరోజు భోజనాలదగ్గిర చేసిన చేష్టలు చూశాక, 'అమ్మబాబోయ్! దీనికి నలభీమ పాకాలకి తక్కువ సయించేలా లేదే. అది చూడబోతే పచ్చిమిరపకాయలకు తొడిమెలుతీసేపాటి మాటసాయిమైనా చేసేలాక్కనబడదాయె. ఎలాగబ్బా?' అని సీతప్ప మూడోకంటివాడికి తెలీకుండా అనుకున్నమాట నిజవే. ఈ కోడలు పిల్ల నాలుగంటే నాలుగే రోజులుండి వెళ్ళిపోయినా, ఈ నాల్రోజులూ వెళ్ళమార్చేదారి సీతప్పక్కనిపించలేదు. అంతా అంధకార బంధురం! అగమ్యగోచరం! అయోమయం! అలాటి సందర్భంలో ఈ శుభవార్త వినిపించింది. ఆనందంగాక మరేవిటి?

సీతప్ప తువాలు అందుకుని మీద వేసుకుంటూ, "అయితేమరి మార్కెట్టు కెళ్ళి వేగిరం కూరలూ గట్రా తెస్తాను. ఏవేం తెమ్మంటుందో కనుక్కో." అన్నాడు.

రావమ్మ నవ్వి, "నాతో బాటు ఇక మీకూ విశ్రాంతే. ఏవేంగావాలో అబ్బిగాడికి చెప్పనూ చెప్పింది. వాడు నన్నడిగి డబ్బులు తీసుకుని బజారు వెళ్ళనూ వెళ్ళాడు! మీరు చెప్పు లేసుకు నేదాకా ఆగుతుందనుకున్నారా యేం?" అన్నది.

సీతప్ప ముసిముసినవ్వులు నవ్వుతూ, "చెప్పవేం?" అంటూ తువాలు వొంకెన తగిలించేసి రామకోటి రాయటానికూర్చున్నాడు.

కాస్సేపటికల్లా వసారా మెట్లమీద అడుగుల చప్పుడయింది. అది ఒక్క మనిషి అడుగులచప్పుడు కాదనీ, ఇద్దరిదనీ సీతప్ప పసికట్టాడు. ఆయన అనుకున్నట్టే సత్యం వెంట శేషుకూడా లోపలికి వచ్చాడు.

"నువ్వురా, శేషూ? బొత్తిగా నల్లపూసైపోయావేమిటి? అంతా కులాసాయేగదా? మీ పిన్ని కొడుకు కులాసాయేగదా— మీ మూర్తన్నయ్య! ఇంకో నౌకరీ ఏదైనా కుదిరిందా, లేక రికామీగానే ఉన్నావా?" అని సీతప్ప శేషును పరామర్శించాడు.

"లేదు బాబాయ్. నేనింక ఉద్యోగం చెయ్యదలచలేదు. బొమ్మలు గీసుకుంటే గిట్టుబాటుగానేఉంది. సినిమాల వాళ్ళకి పోస్టర్లూ, పబ్లిసిటీ జాకెట్లూ అవీ కూడా చేస్తున్నా.

పని చాలా హెచ్చుగా ఉంది. క్షణం తీరటంలేదు. అందికే ఇటుకేసి తొంగిచూట్టంలేదు."

"ఒరేయ్, చూడూ! పంచేస్తే అలాగే చెయ్యాలి. వొంచిన నడువెత్తగూడదు! ఆఁ! కాని శ్రమించినందుకు ఫలించి ఓవంద గిట్టుబాటవుతోందా?"

"నెలకి నాలుగైదొందలు కళ్ళజూస్తున్నానులే... కోడల్ని తెచ్చారటగదా?"

శేషు అన్న మొదటిమాట ఉరుము ఆకాశంలో ప్రతిధ్వనించినట్టు సీతప్ప మనసులో అదేపనిగా ప్రతిధ్వనించిందేమో, శేషు అన్న రెండోముక్క ఆయనకు వినిపించేలేదు.

'నాలుగైదొందలే? వొట్టిది! కోతలు! లేత సొరకాయలు నరికేస్తున్నాడు వెధవ! ఎవడు కనుక్కోవచ్చాడని ధైర్యం! మహా మహా బియ్యేలే బంట్రోతు పని చెయ్యడాని కొస్తున్నారు. పనులు లేక అలో లక్ష్మణా అని అల్లాడిపోతున్నారు. వీడేవిటి? నాలుగైదొందలు సంపాదించడమేంటి?' అని సీతప్ప స్వగతం అనుకున్నాడు.

"లోపలికి రారా, శేషూ కోడలొచ్చింది. లలిత కులాసాగా ఉందా? మీ శకుంతలో?... పోన్లే, పాపం!" అని రావమ్మ అన్నది.

సీతారత్నం శేషును కుడి కంటితోనూ, ఎడమ కంటితోనూ రెండుపార్లుగా చూసి, "నిన్ననే వచ్చా... ఆ!

మా వాళ్ళంతా కులాసాయే!” అని రెండు ముక్కలు శేషుకు బదులుచెప్పి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

“శాగాయికి ఆఫీసు లేదా ? నువ్వింకా వంట ప్రయత్నంలో లేవేం: పిన్నీ?” అని శేషు రావమ్మను అడిగాడు.

సీతప్ప భార్యనుమాట్లాడనివ్వక, “దానికో గమ్మత్తు జరిగిందిలేరా! మీ పిన్ని వంట నాకు దివ్యంగా ఉంటుంది! మన సత్యానికి- అడగే అక్కర్లేదూ! నీకూ-డా దాని వంట ఇష్టవేనూ! అవునా? మా కోడలికి ఏ కారణంచేతో నచ్చింది గాదు. నిన్న ముద్దెత్తిందిగాదు- పస్తుండిపోయిందనుకో? ఎలా గరా శ్రీరామచంద్రమూర్తీ, అని నేనూ అదీ ఎంతో ఇదై పోయాం. మా కోడలు ఇవాళ లేస్తూనే ఏవందో తెలుసా ? ‘అత్తయ్యా, మీ వంట నేం జూశా గదా. కొంచెం నా వంట గూడా మీరూ, మావగారూ చూద్దురుగాని, కాక పోయినా అ సమానూ మీరే పంజెయ్యడం మాత్రం ఏం బావుంటుంది? ఇప్పుడు నేగూడా ఆడదక్షత ఉంటిని గదా! ఓపలేందాన్నయి నప్పటికి ఆపాటి పొయిమీదికి గిన్నె ఎత్తి దించలేనంత దుస్థితి కాదుగదా! అవటాందిరోయ్! ఈ కాల ప్పిల్లల్ని ఉత్తినే ఆడిపోసుకుంటాంగాని వాళ్ళ మనస్సు కని పెట్టావట్టాయినా- వెన్న వెన్నే అనుకో!” అని సోది ప్రారంభించాడు.

సత్యం తెచ్చిన కూరలు సర్దుతున్న కోడలికి వినిపించ గలందులకు సీతప్ప ఈ మాటలు గొంతెత్తి మరీ అన్నాడు. కోడలి మెహర్బానీకోసం సీతప్ప పడే పాట్లు అర్థంచేసుకుని

శేషు చిరునవ్వు నవ్వి, "తిరపతి వెళుతున్నారటగా? సత్యం చెప్పాడు," అన్నాడు.

"మొక్కుందిలే!" అన్నాడు సీతప్ప. ఆ మొక్కు సైనా శేషులాంటి నాస్తికుడికి తెలియడం మంచిదిగాదని, ఆయనకు తోచింది.

"అవునుట, సత్యంచెప్పాడు," అన్నాడు శేషు మళ్ళీ.

సత్యం సత్తెకాలమ్మనిషి. వాడికి తెల్లనివన్నీ నీళ్ళూ, నల్లనివన్నీ పాలూ,- కాదు కాదూ, అటుంచిటు! అయినా సత్యాన్ని తాను సమర్థించి తీరాలి, తప్పదు.

"వాడన్నది నిజవేనూ! ఓ యింటి వాడయ్యాక ఎలాటి వాడికైనా పిల్లలమీద మనసుపోక తప్పదు. ఏవంటావ్? హిరణ్యకశిపుడు చూడూ! కావడానికి రాక్షసుడేనూ. అయి ఉండిన్నీ ఆ ప్రహ్లాదుడిపైన వాడికెంత ప్రేమ! ఎంత యిది! నువ్వున్నావా? సత్యం కన్న నీకే ముందు పెళ్ళయింది కూడానా? ఓ పిల్లా పీచూ లేకపోతే నీ మనస్సెలా వేధపడుతుందో చూడూ! అయ్యో, ఒక చిన్న వాడు ఇంటో పాకురుతుంటే చూసే భాగ్యం లేకపోయెనే! అని మనస్సు ఆరాటపడుతుందంటావా" అన్నాడు సీతప్ప.

"మా దారి వేరులే! మా కిప్పుడప్పుడే పిల్లల్ని కనాలని లేదు. పిల్లలు పుట్టకుండా ఏదో జాగ్రత్త పడుతున్నాం" అన్నాడు శేషు.

"ఈ కబుర్లు నా దగ్గిర చెప్పకురోయ్! ఆ శ్రీరామచంద్రమూర్తి కటాక్షించి పిల్లల్నిస్తే నువ్వాపగలవా? వాడివ్వదలచకపోతే పిల్లల్ని కనడం నీతరవా" ?

"కనడం మా చేతుల్లోగాని. కనకుండా ఉండడం చాలా వరకీనాడు మన చేతుల్లోనే ఉంది."

"పొరపాటు! అపచారం! అంచేతను సత్యం వెంకటే శ్వరస్వామికి మొక్కుకున్నాడు— భార్య గర్భిణీగా వుంటే కొండకు వస్తానవటాని !"

శేషు ఆశ్చర్యంతో, "అదా సంగతి ? నాతో వాడీ మాట చెప్పలేదు సుమా !" అన్నాడు.

తన నోటి మీదుగానే రహస్యం వెల్లడైపోయినందుకు సీతప్ప చాలా నొచ్చుకున్నాడు. ఆయన మాట మారుస్తూ, "వెంకటేశ్వరస్వామి మహా దాఖలాగల దేవుడు. సందేహం లేదు. నువ్వేది కోరుకో, చేసేస్తాడు. కొండమీది కోతి కావాలను, పట్టుకుపో అవటాంటాడు. కాని చాలా స్ట్రిక్ట్. బాకీలు నయాపైసల్తో సహా వసూలేస్తాడు. ఆడి తప్పడానికి వీల్లేదు. సహించడంతే!" అన్నాడు మొహం రాయిలా చేసేసి.

"వెనక తలనొప్పి తప్పించేవాట్ట, దాంతో భక్తులు తారె తేవారు. ఇప్పుడీ తలనొప్పి మందులు కొల్లలుగా వచ్చి పడ్డాయి గదూ? ఆ టెక్నిక్ మానేశాడు. ఇప్పుడేం జేస్తు న్నాడో తెలీదు" అన్నాడు శేషు.

ఈ ధోరణి సీతప్పకు నచ్చలేదు.

"వెంకటేశ్వరస్వామి తల్చుకుంటే యేం చెయ్య లేడ్రా, వెర్రివాడా ?" అన్నాడాయన.

"కిందటేణ్ణాల తిరపతెళ్లాం—" అని శేషు ఆరంభించాడు.

“ఇకనేం? నీకూడా దేవుడంటే గురేనన్నమాట!” అన్నాడు సీతప్ప తెల్లారిలేచి ఇది రెండోసారి సూర్యదర్శనం అయినట్టవడం.

“నేను స్కెచెస్ వేసుకోవడాని కెళ్ళాను మూర్తన్నయ్య ఫోటోలుతీశాడు. చెప్పొచ్చిందేమంటే, ఎరిగినవాళ్ళు మొక్కుండి మాతోబాటే కొండెక్కి, మాతోబాటే దిగొచ్చారు. వాళ్ళుచెప్పారు, తిరుపద్దేవుడి కళ్లెదటే బహిరంగంగా దోపిడీ జరిగి పోతుందిట. అయిదు కొబ్బరికాయలని వాళ్ళు దేవుడికిస్తే రెండుకొట్టి మూడు వెనక పెట్టేశాట్ట అర్చకుడు. కర్పూరంకొంటే ఒకొంతు వెలి గించి మిగతాది వెనక పెట్టేశాట్ట! అందంతామళ్లీ అంగడి కెళ్ళిపోయి అమ్ముడవుతుందిట. అక్కడి వాళ్ళు దేవుణ్ణి వొట్టిబుద్ధాయి కిందైనా జమకట్టివుండాలి—లేదా దేవుడు వాళ్ళ పక్షమైనా అయిఉండాలి!” అన్నాడు శేషు.

‘శ్రీహరీ! శ్రీరామచంద్రమూర్తీ తెల్లారిలేచి ఎలాంటిమాటలు వినవలసొచ్చింది?’ అనుకున్నాడు సీతప్ప.

“ఒరే, అబ్బి అలా చెప్పొదు మాటలు విని దైవ దూషణ కూడదు! పెద్దవాణ్ణి చెబుతున్నా. నువ్వా పైకి రావలసినవాడవు.” అన్నాడు సీతప్ప.

“బాబోయ్, నేను కోల్డ్‌వార్‌లో న్యూట్రలిస్టును. స్వతహాగా నాకు తిరపద్దేవుడు గురించిగాని, తీర్థాల దేవుణ్ణి గురించిగాని ఒక అభిప్రాయమంటూ లేదు. నాతో ఈ విషయం చెప్పినవాడు ప్రోగాడ్—దేవుళ్లో నమ్మకంవుండి

మొక్కు చెల్లించడానికి వచ్చినవాడు. అతనన్నదే నీకు చెప్పాను." అన్నాడు శేషు...

శేషు లేచి, "వస్తాను. బోలెడంతపని నాకోసం కాచుకూచుంది." అని వెళ్ళిపోయిందాకా సీతప్ప సుఖంగా గాలి పీల్చలేదు.

*　　　*　　　*

"ఏమేవ్! తొమ్మిదైపోయింది! వేగిరం, వేగిరం!" అంటూ సీతప్ప రామకోటి కళ్ళకద్దుకుని గాభరాగా లేచాడు.

"గంగాస్నాన మహం కరిష్యే," అని సీతప్ప మొదటి బాల్చీనీరు నెత్తిన పోసుకున్నాడో లేదో రావమ్మ పిల్లిలాగా మునివేళ్ళమీద నడుచుకుంటూ ఆయన దగ్గిర కొచ్చి, రహస్యంగా, "ఇంకేంవుందీ? అంతా అయిపోయింది!" అన్నది.

"నువ్వు తొందరపడకు! మరేం కంగారేదు! ఏం జరిగిందేవిటి?" అన్నాడు సీతప్ప, చలికిగాబోలు కొంచెంగా వణుకుతూ.

"ఇంకేం జరగాలి! మడీమన్నూ లేకుండా వంటజెయ్యడ వలావుంచి కూరలోనూ, పప్పులుసులోనూ ఉల్లిగడ్డలు వేసింది కోడలు. పచ్చడికూడా ఉల్లిపచ్చడేనూ"

"ఇంటో ఉల్లిగడ్డనేదిలేదే!"

"అబ్బని తెమ్మనుంటుందీ! వాడు వీశెడు తెచ్చుంటాడు. వంటిల్లంతా ఉల్లికొంపకంలమయం. బొత్తిగా ఇంతకిరస్తానీ ఐతే యేలాగండీ?" అన్నది రావమ్మ.

ఈ దుర్వార్తను ఎలా ఎదుర్కోవాలో సీతప్ప క్షణంలో ఆలోచించాడు.

"నీకు తెలీదే, పిచ్చిదానా! కడుపుతోన్న వాళ్ళకు రకరకాల కోరికలుంటాయి. బెడ్డలు తినేస్తారు, సున్నం బెత్తికలు తినేస్తారు. పాపు తింటారు తెలుసా? మా పున్నమ్మత్త య్యకి వేవిళ్ళొస్తే కాగితాలు తినేసేదిట. దీనికి ఉల్లిగడ్డలు తినాలనిపించిందో యేవిటోనూ, తిన్ని! నువ్వడ్డకు! తినేసి! అంతే!"

"నేనొద్దన్నా నేవిటి మీరుమాత్రంవస్తే! నేనేదో పాచ్చింతకాయ తొక్కు వేసుకుతినేస్తా. నాదేవుంది?" అన్నది రావమ్మ.

"నేనూ అంతే అనుకో!...చూడూ. వంటయితే వాణ్ణీ, దాన్నీ తినేమను. ఆ తరువాత మనపాట్లు మనం పడదాం!" అన్నాడు సీతప్ప.

"మరి మీ జపం?"

"అంతా ఇక్కడే కానిచ్చేస్తున్నాను. లేకపోతే ఆఫీసుకి వేళ మించిపోదూ?... ఓంభూర్భువస్సువహా, ఓం తత్సవితుర్వ రేణ్యం..."

జపంతో ముడిపడంచేత సీతప్పగారి స్నానం అనుకున్నంత త్వరగా తెవల్లేదు. ఆయన సూర్యుడికేసి ఏవో దణ్ణాలు పెడుతూండగా రావమ్మ పిల్లిలాగా మళ్ళీవచ్చి, "అవునుగాని ఈకబురు విన్నారా?" అన్నది.

"ఏవిటేవిటి?" అన్నాడు సీతప్ప ఆదుర్దాగా.

"చెడ్డ చిక్కే వచ్చింది లెండి ఈ మారు." అన్నది రావమ్మ ఎంతో ఆత్మ సంతృప్తితో.

"నిజంగానా ? ఏవిటది ?"

"ఈ ధర్మ సందేహంనుంచి బయటపడెయ్యటం మీ వల్లే కావాలి."

"అలాగేనూ ! దానికేం భాగ్యం ? అసలు సంగతే విటో చెప్పావు గావు."

"అబ్బి మొక్కు-న్నాట్ట ?"

సీతప్ప ఆత్రవంతా నీరుగారిపోయింది. "సరిపోయింది. అదంతా పాత కథే కదూ ?" అన్నాడాయన.

"మీరు పెరటితోవ నున్నారు. మీ రనుకునేది పాత మొక్కు. ఇది కొత్త మొక్కు. నిన్న రాత్రే మొక్కు-న్నాట్ట

"ఏవని ?"

"అసలు సంగతేవిటంటే. కోడలు ససేమిరా తిరపతి కొండకి రానని వాడితో ఖచ్చితంగా చెప్పేసిందిట. దాని మనసు మారితే కొండ కొస్తానని ఇంకో మొక్కు మొక్కాడట మనబ్బి !"

కఠినమైన లెక్కను పరీక్ష విద్యార్థి చూసినట్టుగా సీతప్ప రావమ్మ మొహంకేసి చూశాడు. చిట్టచివరకు తల ఆడించి, "అవును," అన్నాడు.

"అవునా ?" అన్నది రావమ్మ తెల్లబోయి.

"నిరభ్యంతరంగానూ !" అన్నాడు సీతప్ప సాహసంతో.

"ఏవిటి మీరంటూంట ?" అన్నది రావమ్మ వేదన భరించలేక.

"దాని కేటుంస నేన్నీకు అరిటిపండొలిచినట్టు చెబుతానుండు. తిరపతి వెంకట్రామచంద్రమూర్తికి నువ్వెన్ని మొక్కులైనా మొక్కోగాక, అన్నీ ఒక్కసారే చెల్లించెయ్యొచ్చు. తప్పు లేదు ఆ విషయంలో యేడుకొండలవాడు చాలా లిబరల్. ఎందుకూ ? మా తాత మొక్కిన మొక్కు నా చిన్నతనంలో తీర్చారు గాదూ ? అంచేత అబ్బి ఎన్ని మొక్కులు మొక్కినా భయంలేదు. నువ్వేమీ కంగారు పడిపోకు," అన్నాడు సీతప్ప.

రావమ్మ మొహం వికసించింది.

"హమ్మయ్య. నాకు తెలుసు మీరీ చిక్కు ఇట్టే విడగొట్టేగలరని!"

"మరొ వటికూడా ఆలోచించావో లేదో_మనభక్తి పరీక్షించేందుకే ఆ వెంకటేశ్వస్వామివారు దాంచేత కొండెక్కనుగాకెక్కనవటానిపిస్తూండొచ్చు. మనవాడు ఈ రెండో మొక్కుతో తనభక్తి స్వామివారికి మరింత ఘట్టిగా రుజువు చేసుకున్నాడేతప్ప విడిచి మరోటి కాదు... ఆఁహా! ఓవేళ దానికే కొండెక్కరాదూ అనిపించిందనుకో, దానిమనసు మార్చడానికి దేవుడికి దణ్ణవెట్టుకోవడం మంచిపనేగదూం? ఏమంటావు?"

"నాకంతా అర్థమైపోయిందన్నాగా!" అన్నది రావమ్మ.

సీతప్ప సాయంకాలం ఆఫీసునుంచి ఇల్లుచేరుకునేసరికి దీపాలు వెలిగించేశారు. "వేగిరం, వేగిరం," అనీ తనను తానే తొందరచేసుకుంటూ ఆయన బట్టలు మార్చేసుకుని, చేతులూ, కాళ్లూ మొహమూ కడుక్కుని; లోటాడునీళ్ళు తాగి రామకోటి రాయడానికి కూచుంటూనే అంతలో కొయ్యబారిపోయాడు.

రామకోటీ కాగితాలగ్రొత్తి ఉండవలసినతీరుగా లేదు. ఎవరో దాన్ని ఏవిటో చేశారు. కాగితాలు పైవి కిందికీ, కిందివి పైకీ పెట్టారో, ఏదో అయింది. పైనున్న కాగితం తాను పొద్దుట రాసింది మట్టుకు కాదు.

"ఇదుగో, ఏమేవ్?" అని సీతప్ప కేక పెట్టాడు.

"వొచ్చె, వొచ్చె!" అంటూ రావమ్మ వచ్చి, పిల్చారా?" అని అడిగింది.

"అవును రామకోటిగాని సద్దలేదుగద?"

"నేనా? లేదే!"

"వాడేవన్నా-వాడేడీ?"

"అయ్యో, నా తెలివి తెల్లారా? చెప్పటం మరిచి పోయాను. వాళ్ళిద్దరూ కలిసి సినిమాకెళ్ళారు. అదేదో ఇంగిలీషు సినిమా అట!"

"వెళ్ళనీ. ఇప్పుడుకాకపోతే మరెప్పుడు సుఖపడతారు? మరేం లేదుగాని ఈకాగితాలు కాస్త తారుమారయాయి. అంతకంటె మరేవీలేదు."

సీతప్ప పైకి అలా అన్నాడేగాని లోపల ఏదో అను మానం—ఏదో ఆందోళన—ఏదో భయంలాంటిది—పీకు తూనే ఉంది. ఆయనకు రామకోటి విడికాయితాలమీద రాసి బొత్తిలో చేరుస్తూండడం అలవాటు, రోజుకు రెండు కాగితాలు ఆఫీసునుంచి తెచ్చుకుంటే పని గడిచిపోయే దానికి బొండు పుస్తకాలు కొనడం దండుగుమారిపని.

పైనున్న కాగితంచూస్తే నాలుగైదు రోజుల్నాటిది లాగుంది. ముప్పావు భాగం ఖాళీఉండిన కాయితం ఏమ యిందో తెలియదు. బొత్తంతా వెదికినా అది కనిపించనే లేదు. కాగితం గాలికి కొట్టుకుపోయుండడం అసాధ్యం. ఎవరూ తన రామకోటిని ముట్టరు—అది ఎన్నడూ జరిగినది కాదు. వెనకెప్పుడో చెదలు పట్టాయిగాని మనుషులు దాని జోలికి రాలేదు. ఇంతకీ మరేం లేదుగాని, రేపుకొత్త కాయి తాలు తెచ్చిందాకా రామకోటి రాయడానికి లేదు. ఏమయితే అవుతుంది! అంతా వాడి దయ.

'ఇదుగో, నువ్వు వేగిరం మడిగట్టుకుని పోయి రాజేసి, వాళ్ళొచ్చేలోపుని ఇంత వండి వార్చకపోయావో ఇవాళ కటికి లంఖణవేనూ! అంచేత మరి_తెలిసిందిగాదూ?' అన్నాడు సీతప్ప.

ఆయన కీ పూట రామకోటి రాసుకునే యోగం లేదు గనక ఏదన్నా సద్గ్రంథం చదువుకుందా మనిపించింది. కాని యింటో అలాంటి పుస్తకం ఒక్కటీలేదు— ఏనాటిదో బృహత్స్తోత్ర రత్నాకరం వుంది. సీతప్ప ఎన్నో పుస్తకాలు కొనాలనుకున్నాడు— యోగవాశిష్టవేవిటి, సీతారామాంజ

నేయ సంవాదవేవిటి. ఉపనిషత్సారవేవిటి, గీతారహస్య వేవిటి, ఎన్నో కొనవలసి వున్నాయి. కాని కొండం పళ్ళే దంతే...అబ్బిగాడిదగ్గర పుస్తకాలుంటాయి. వాడి బావ మరిది సయానా పబ్లిషరేనాయె. మంచి మంచి పుస్తకాలలా వేసేస్తూ వుంటారు. వాడిగదిలోచూస్తే విలవైన పుస్తకాలు ఎన్నైనా దొరకవచ్చు.

అంచేత సీతప్ప తనకొడుకు పడకగదిలోకివెళ్లి గాలిం చాడు. ఎక్కడా పుస్తకవన్నదిలేదు. కాని మంచంమీద దిండు కిందినుంచి ఏవో పత్రికలు తొంగిచూస్తున్నాయి. సీతప్ప పరధ్యానంగా వాటిని పైకి తీశాడు. ఏవో ఇంగ్లీషు పత్రికలు. అందులో దేవుడూ, భక్తీ ఉండడానికి వేల్లేదు గాని ఆరోగ్యసంబంధమైన పత్రికలా కనబడింది పత్రిక పేరు చూస్తే.

సీతప్ప పత్రిక తెరిచి చూశాడు. లోపల అన్నీ దిసి మొల బొమ్మలు. ఆడాళ్ళవి. సత్యం ఇలాటి పత్రికల్ని పక్కలోపెట్టుకు చదువుతాడు? నమ్మశక్యంగాని విషయం. ఎక్కడన్నా ఓ దేవుడి బొమ్ముండకపోతుందా అనుకున్న వాడులాగా సీతప్ప పేజీలన్నీతిప్పి ప్రతి నగ్న చిత్రాన్నీ పరి శీలనగా చూశాడు. అన్నీ చూశాక ఆయనకి ఒకటే అని పించింది: నువ్వెంత లేదనుగాక ఆ దొరసాన్ల శరీరాలున్నట్టు మన ఆడాళ్ళ శరీరాలుండవు; వాటి. పొంకవే వేరు...

'ఏమండోయ్! ఒక్కసారిలా రండీ!' అన్న ఆర్త నాదం వంటింట్లోంచి వచ్చింది.

సీతప్ప పత్రికను జారవిడిచి వంటింటికేసి పరిగెత్తాడు. "ఏం జరిగింది? ఏం జరిగిందేవిటి?" అంటూ.

"ఇంకేం జరగాలండీ? మీరు సంపాయించుకున్న పుణ్యమంతా బుగ్గయిపోయింది. రౌరవాది నరకాలే మీకు మిగిలాయి" అన్నది రావమ్మ.

అవును, ఆ దౌరసాన్ల బొమ్మలు చూడకుండా ఉండ వలిసింది. కాని అవిచూసినట్టు దీనికెలా తెలిసింది చెప్మా, అనుకున్నాడు సీతప్ప. ఆయన పైకి "నువ్వేమీ కంగారు పడకు. మరేం భయంలేదు. ఏం జరిగిందో చెప్పు. మిగతాది నే చూస్తా" అన్నాడు.

"ఇంకేం జరగాలీ? ఇవిగో రామకోటి కాయితాలు" అన్నది రావమ్మ.

"దొరికాయా! హమ్మయ్యా! దొరుకుతాయని నాకు ముందే తెలుసు. చోరులు కోరని నిధి అన్నాడు కవి! ఏవి టనుకున్నావేవిటోను!" అన్నాడు సీతప్ప.

"నా బొంద...మీ కోడలు వాటితో నెయ్యి కరగ బెట్టేసింది. నాలుగ్గంటలకు టిఫినేదో తెచ్చుకుతిన్నారు. అందులోకి నెయ్యి కావాలిసొచ్చింది గాబోలు. మీ రామ కోటి కాయితాలతో నెయ్యి కరగబెట్టేసింది. కాలని తుం పులు చూడండి" అన్నది రావమ్మ.

"హాయ్యో! హాయ్యో! రామకోటితో నెయ్యి కరి

గించడవేవిటే? ఏక్కడేనాకద్దా? యెంతపాపం! కళ్ళుపోతాయి గాని మరోటా?"

"అదే నే నంటూంట!"

'దేనికన్నా విరుగుడుందిగాని దీనికి విరుగుడు లేదు ! శ్రీరామచంద్రమూర్తీ, ఈ నేరాన్నెలా క్షమిస్తావో' అని సీతప్ప వంటింటి కప్పుకేసి చూసి కళ్ళు భక్తిగా మూశాడు.

* * *

సీతప్పా, రావమ్మా భోజనాలు ముగించిన కాస్సేప టికి సినిమానుంచి సత్యమూ, సీతారత్నమూ వచ్చారు. వాళ్ళు వచ్చినదాకా భార్యాభర్తలు రామకోటి గురించే మాట్లాడుకున్నారు.

"ఇది తప్పక నెత్తి కొడుతుంది. ఇంతపని జరిగాక వట్టినేపోదు. చూస్తూండు! ఎన్నడూ లేంది ఈ కొంపలో కొద్దికాలంగా దేవుడికే విఘాతం ఆరంభమయింది. అంత కంతకీ పెద్ద ఘోరాలు జరిగిపోతున్నాయి. ఇదిలా ఎక్కడికి దారితీస్తుందో ఏమిటోనవటానని నాకు చెడ్డ బెంగగాఉంది. ఆ శ్రీరామచంద్రమూర్తి వారి దయవల్ల ఈ ఘోరాప రాధం ఎక్కడోక్కడ నిలిచిపోతే బాఘ్ణు" అన్నాడు సీతప్ప.

"అవి వచ్చాక, ఎందుకిలా చేశావవటాని మాట వరస కడగన్నాగా" అన్నది రావమ్మ.

'నువ్వూరుకో. నీ కెందుకొచ్చిన బెడద? నా రామ కోటి కాయితాలు దాచేస్తే సరిపాయె' అన్నాడు సీతప్ప.

"నుశేంలేదు. దాని ఉద్దేశాలేవిటో తెలుసుకుందా వసీ!"

"చిన్నపిల్ల కాదుటే! అభవ్రూ, శుభవ్రూ తెలీదు నురి. అమ్మో, ఇది రామకోటి గాబోలు. మావగార్లు దీన్ని ఎన్నేళ్ళుగా, యెంత దీక్షతోటీనున్నా, యెంత శ్రమపడి రాస్తున్నారోనని దానికి గ్రహింపే ఉంటే ఆ కాగితాలు పట్టుకెళ్ళి నెయ్యి కరగబెట్టేసునా? ఒక్కనాటికి జరగదు. జరగటానికి వీల్లేదంతే! అసలు ఆ కాగితాలంటడానికే గుండె ధైర్యం చాలదు! అక్షరాలన్నీ తాచుపావుల్లా కనిపించేసి భయవేస్తుందనుకో!" అన్నాడు సీతప్ప భయం అభిన యిస్తూ...

సినిమానుంచి వచ్చిన జంట ఏకంగా గదిలోకెళ్ళీ తలుపు వేసుకున్నారు. గదిలోపల్నించి యిద్దరూ యేదో చెప్పకుని కికవికలాట్టం వినపడింది.

రావమ్మ భర్తచెవిలో రహస్యంగా, "అది బట్టలు మార్చుకునేప్పుడు వాడూ అక్కడే ఉంటాడేవిటీ? ' అన్నది.

ఏదో పోనిస్తూ అన్నట్టు సీతప్ప సౌజ్ఞచేశాడు.

సీతారత్నం వంటింటికేసి వెళ్ళిపోగానే రావమ్మ లేచివెళ్ళి గదిలోనే ఉన్న తన కొడుకు దగ్గిరకు వెళ్ళింది.

'వెర్రి బాగుల్ది! 'నీ పెళ్లాం చీరె కట్టుకునేప్పుడు అవతల కెళ్ళిపోరాదురా?' అని అడిగెయ్యాదుగద?' అని సీతప్ప భయపడ్డాడు.

మరి కాస్సేపటికి తల్లీ కొడుకులు బయటి కొచ్చారు. సత్యం వంటెంట్లో కెళ్లాడు, రావమ్మ దొడ్లో కెళ్ళింది.

ఆ తరవాత నిమిషమే అయిందో, రెండు నిమిషాలే అయిందో సీతప్ప గమనించలేదు—పెద్ద పెట్టున గోడలు అరవటం ఆయనకు వినిపించింది.

"ఛీ, ఛీ, ఛీ! జంతువులు; అడివి మృగాలు! వీళ్ళ కన్న కుక్కలూ, పందులూ లక్షరెట్లు నయం!"

"ఏవిట్రా? ఏవిటా?" అంటూ సీతప్ప లేచి వంటింట్లోకి పరిగెత్తి, "నువ్వేవి తొందర పడకమ్మాయి ... యేం జరిగిందిరా, అబ్బీ! ఏవన్నా అన్నావేవిటి?" అని శాంతి నెల కొల్ప యత్నించాడు. కాని మరుక్షణమే గోడలి అవతారం చూసేసరికి ఆయనికి గుండె జారిపోయింది. తెనాల్లో లెక్కల మేష్టరు చేసిన రోజుల్లో విజయదశిమికి భేతాళ బొమ్మ లొచ్చాయి చూడూ, అలా ఉంది గోడలు. కళ్ళు రెండింత లయాయి. ముక్కులూ పెద్ద వయాయి — అమ్మశక్తిలా గుంది!

"రామకోటిట, రామకోటి! ఈ నూతిలో కప్పలకి రామకోటొకటీ! చిత్తుకాగితాలేనా లేని దరిద్రపుగొంప! రామకోటిపెట్టె యాకంగా వంటేచేసేస్తా! నీళ్ళు కాచేస్తా; ఎవరన్నా అడ్డొస్తే నడ్డి విరగదంతా!" అంటూ సీతారత్నం ఆవేశంతో అరిచేస్తోంది.

ఎప్పుడొచ్చిందో, రావమ్మ సీతప్ప పక్కనే బెదురుగా నిలబడి వుంది.

"పూనకవే! గోడలికి వెంకటేశ్వర స్వామివారు పూనారు...స్వామీ, తండ్రీ! మా తప్పులన్నీ మన్నించు.

నాయనా, మావల్ల జరిగిన అపచారాలేవన్నో చెబితే సరి దిద్దుకుంటాం! చెబితేగదా తెలిసేదీ? ఎంతైనా మానవ మాత్రులమే నాయిరి...దణ్ణంపెట్టవే! స్వామి కాళ్ళమీద పడి అపరాధం అనరా, సత్యం!" అంటూ సీతప్ప కల్లుతాగి నిప్పుతొక్కిన కోతిలాగా ప్రవర్తించసాగాడు.

రావమ్మ గబ గబా ఒక పళ్లెంలో నిప్పులు వేసు కుని గుగ్గిలం ధూపంవేసి సీతారత్నం చుట్టూరా తిప్పింది.

సీతారత్నంలో కలిగినమార్పు వర్ణనాతీతం. ఆమె మొదట కళ్ళు మరింత పెద్దవిచెయ్య యత్నించింది. ఆ తర వాత వొక పెద్ద వెర్రికేకపెట్టి నవ్వుతూ మడతబడిపోయి కూలిపోయింది.

"పూనకం దిగిపోతూంది; స్వామివారు అనుగ్రహిం చారు! చెప్పేతీరుగా చెబితే దేవుళ్లయినా వింటారు...... అమ్మాయ్, ఇప్పుడెలా ఉందమ్మా ?" అని సీతప్ప వంగి కోడల్ని మృదువుగా అడిగాడు.

కాని సీతారత్నం పలకలేదు. ఆమెకు నవ్వు జాస్తి అయి ప్రాణం కడబట్టి నట్టయింది. సత్యం మొహాన యిన్ని నీళ్ళు చల్లినాక ఆమె నీరసంగాలేచి, మొగుడి సహాయంతో గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ తరవాత కాస్సేపటికి సత్యం ఇవతలకొచ్చి, "మేం రేపొద్దున్న ట్రంకుబండిలో బయలుదేరి వెళ్లిపోతున్నాం!" అని చెప్పాడు.

# 12

సీతప్ప కేవీ పాలుబోలేదు. వెనకటికి సముద్రమ్మీద ప్రయాణాలు చేసేవాళ్ళు తుఫానులో చిక్కుకుని పడవలతో సహా ఎటో కొట్టుకుపోయేవారట. తాము ఎటుపోతున్నదీ, చివరికి తమగతి ఏవయేదీ తెలిసేది కాట్ట. అలాఅయి ఊరుకుంది సీతప్ప వ్యవహారం. హాయిగా కాలిమీద కాలేసుకు రామకోటి రాసుకుంటున్నవాడు, జల ప్రళయం అవటాని నెల్లాళ్ళు ఆఫీసుకు సెలవుపెట్టి, ఇల్లు తాళం పెట్టి, యిటు మనవరాలి శాంతీ, శారసాలా గట్రా జరిపించినట్టూ ఉంటుంది రాక రాకొచ్చిన బంధుగుల్ని వియ్యాలవారూ, అల్లుడూ ఆప్యాయంగా ఆదరిస్తారుగదా, నెల్లాళ్ళు క్షణంలా వెళ్ళిపోతుందవటాని భార్యాసమేతంగా వచ్చేశాడా, అంతా తారుమారూ, తలక్రిందులూ అయి వూరుకుంది. వియ్యాలవారు శాంతికీ, శారసాలకీ ఎగనాం పెట్టేశారు. చేసిన కూర చెయ్యకుండా, వండిన పిండివంట మళ్ళీ వండకుండా విందులమీద విందులు చేస్తారనుకున్న వియ్యాలవారు అంటీ అంటనట్టుండిపోయారు. ఓ మంచీ చెడ్డా విచారించిన పాపాన పోరాయిరి. సత్రవు నయం! 'ఇంకా మీరు వెళ్ళిపోరే' అని అడగడవే తరవాయి.

ఒక్క తనే అయితే నిభాయించ గలడు. ఆ శ్రీరామచంద్రమూర్తివారి దయవల్లను తను యే వొచ్చిపడనీ గాక తట్టుకోగల్డు! అంతవరకు ఖరారే. కాని యీ అమాయకపు

ఇల్లాలు వియ్యాలవారి అమర్యాదకు మహా క్షోభ పడి పోతోంది. వాళ్ళు చేసుకున్న కూరలు కొన్ని తమ యిద్దరి దాకా రాలేదుట నిజవే అయుంటుంది. 'ఏవిటండీ యీ మాయదారి పీడా? నిక్షేపంగా మనింటికి మనం పోదాం.' అంటుంది. ఇంటికి పోవడవంటే తేలికేనూ. అలా బండి గట్టించుకుని తిన్నగా స్టేషను కెళ్ళిపోవడమూ, మద్రాసుకు రెండు టిక్కెట్లు పుచ్చేసుకోవడమూ, రైల్లో ఎక్కి కూచోడ మూనూ. మరి జల ప్రళయం మాటో ! అది మరిచిపోతే ఎలా? పట్నం వెళ్ళి ప్రళయంలో మునిగి చావటం మేలా ? ఏదోలా ముక్కు మూసుకుని, అవమానాలన్నీ పడుతూ-పడ్డవాడెప్పుడూ చెడ్డవాడు కాడు ఏమనుకున్నా రేవిటోనున్నా వియ్యాల వారింట్లో ఉండిపోడం మంచిదా? ఇంత స్పష్టంగా చెప్పినప్పటికీ నున్నూ దాని ససే దాండీ !

నాల్రోజులు అల్లుడు గారింట్లో కూడా ఉండావనే సీతప్ప అనుకున్నాడు. దాపరికం దేనికీ ? కాని భద్రాచలం ఊళ్ళో లేడు. అతను లేని సమయంగా చూసి అమ్మనీ నాన్ననీ పిలవడానికి సావిదేవి తటపటాయిస్తున్నట్టు కనిపిస్తుంది. 'అమ్మా, ఈపూట నేనూ, అమ్మా నీ చేతి వంట తిందా వనుకుంటున్నాం.' అంటే సావిదేవి ఎగిరి గంతెయ్యదనా? కాని అంతదాకా రానివ్వడం దేనికి? కన్ను పోయినంత కాటుకెందుకు.

అయినా అల్లుడి గారింట నాల్రోజులుండటానికి ఇంకా బోలెడు వ్యవధివుంది. ఈ నవగ్రహ కూటం ఇంకా ఎక్కడా కనుచూపుమేరలో లేదు. పదకొండున్నూ, నాలుగూ-దిప

హేను రోజులుంది. ప్రళయం అయిపోయాక ఎంతకాలానికి రైళ్ళాగట్రా నడుస్తాయో తెలీదు. దిక్కుమాలిన రైళ్ళు ఓ పదిరోజులు ముందే నిలిచిపోగూడదూ?

పోనీ సత్యంతో కబుర్లాడదావన్నా వాడికి రాత్రీ తీరదు. పగలూ తీరదు. మెరుపులా కనిపిస్తాడు. అంతలోనే మాయవవుతాడు. సావిదేవి ఏవేవిటో అంటుందిగాని అబ్బిగాడి బండి సరిగా పట్టాలమీద నడుస్తున్నట్టే కనపడుతూంది మరి. ఉత్తమంశ్వశురమందిర వన్నారు. అల్ల విష్ణుమూర్తి అత్తవారిల్లయిన పాలసముద్రం చేరాట్ట. అలాగే శివుడూ నున్నా హిమాలయంలో మకాం పెట్టేశాట్ట. ఇహనేం? మనవాడూ అత్తారింట చేరి కూర్చున్నాడూ! చేతినిండాపని! నిక్షేపంలా ఆడపిల్లని కనేశాడూ! ఇహ వాడికేంలోటూ?

"ఏవండీ. గ్రహ శాంతికోసం ఎక్కడో యొగ్గం చేస్తున్నారట. రెణ్ణాళ్ళు అలా వెళ్ళొద్దావా ఏవిటి?" అన్నది రావమ్మ.

పిచ్చిది! వియ్యాలవారింటినుంచి యెలాగైనా తప్పకుందావని దాని ఆరాటం.

"వెళ్ళి? మళ్ళీ యిక్కడికి చేరవలసిందేకదూ? యొగ్గాలూ, యాగాలూ అంటే వీళ్ళకి చాలా వెటకారం. యొగ్గాని కెళ్ళొచ్చావవటాని తెలిసిందో వీళ్ళు మన్ని బతకనివ్వరు – మన తాళం పట్టేస్తారు," అన్నాడు సీతప్ప.

"పోసి మా పెత్తల్లి సవితి కొడుకు బందర్లో ఉంటున్నాడు. వాణ్ణి పెళ్ళప్పుడు చూశానంతేనూ. పది రోజులున్నా వెళ్ళనివ్వడు. నాకు తెలుసుగా?" అన్నది రావమ్మ.

ఉన్నచోటు నరకవయాక అది తప్పవిడిచి అన్నిచోట్లూ స్వర్గంలా ఉండడం సహజవే మరీ!

"బందరా? బందరే? నయం! అదిమాత్రం సవ్రద్రపుట్టొడ్డు గాదుటే, పిచ్చిదానా? అక్కడా జలప్రళయ వేనూ! ఆకాడికి నిక్షేపంలా మనింటోనే మనం మునిగి పోవచ్చుగా!" అన్నాడు సీతప్ప.

"అవునండో యన్నట్టూ! నా కామాటే గుర్తు రాలేదుస్మీ!"

"విశాకపట్టం దగ్గిరేగా మా అక్కయ్యిప్పుడుంటా? అక్కడికే పోలేకపోయాంవా? ఏ ఆలోచన చేసినా కాస్త ముందూ వెనకా ఆలోచించి మరీ చెయ్యాలి. యెద్దీనిందంటే దూడకు పలుపుతేరా అన్న సావెతగా ఆలోచించగూడదు. ఎంచేతంటావేఁవో, మనం నిమిత్తమాత్రులం. కర్తృత్వవంతా వాడిపైనవేసి, శ్రీరామచంద్రమూర్తీ, అన్నిటికీ నువే ఉన్నావవటానుకోవటమూ నున్నూ, మన విధి మనం నెరవేర్చటవూ నున్నూ! అంతే తప్పవిడిచి మన చేతిలో ఏఁవీ లేదు. అది తెలీకే అజ్ఞానంలో పడుతూంటాం," అని సీతప్ప రావమ్మకు మనశ్శాంతి కలిగే ముక్కలు నాలుగు చెప్పాడు.

# 13

భద్రాచలమూ పార్వతీ తిరిగొచ్చినట్టు తెలియగానే సీతప్పకి ఎందుచేతనో మనస్సు తేలిక పడింది. రావమ్మ గారికి తన వియ్యాలవారింటికన్న పెత్తల్లి సవితికొడుకిల్లు మెరుగనిపించినట్టుగానే, సీతప్పకి తన వియ్యంకుడు సీతాపతికన్న భద్రాచలం వెయ్యిరెట్లు పెద్ద మనిషిగా కనిపించాడు.

"ఏవండీ, అల్లుడూ, ఆ_ అమ్మాయీ_వచ్చారుట. వెళ్లి చూసొద్దాంవా? చూడడం భావ్యంగా ఉంటుంది. ఏవంటారు?" అని రావమ్మ అనగానే సీతప్ప మొహం వికసించింది.

"అయ్యో చూడొద్దూమరీ? భావ్యవా, భావ్యవా; చూడకుండా ఉండటానికి వీల్లేదంతే! రోజూ వచ్చిపోయ్యే వాళ్ళవాఁ ఏవన్నానా? ఈ నవగ్రహకూటవొకటి వచ్చి పడబట్టే వచ్చాంగాని మనవసలెందుకొస్తాం? మన కిక్కడేంపనీ? ఏ యెండ కా గొడు గన్నారు. ఈశ్వరాగ్గ లేందీ ఈగైనా వాలదు. పనసకాయ దొరికిన్నాడే తద్దినం పెట్టమని శాస్త్రం! అంచేతను_"

తానేవంటున్నదీ తనకే అర్థంగాక సీతప్ప ఆగిపోయే సరికి రావమ్మ, "అయితే అలా వెళ్లి తొంగి చూసొద్దాం, పదండీ!" అన్నది.

భద్రాచలం మేడమీదున్నాడు. రావమ్మ కిందనే కూతురిదగ్గి రుండిపోయింది. సీతప్ప జంకుతూ జంకుతూ పైకి వెళ్ళాడు.

"ఎప్పుడు రావడం? రండి, కూచోండి," అన్నాడు భద్రాచలం మావగార్ని.

"మేమొచ్చా? ఏం? చాలా రోజులయింది. దాదాపుదిరోజులుకాలా? శోకలు పురిటి నీళ్ళోసుకునేనాటికి చేరాం. రాక రా కొచ్చాంగదా అని నాల్రోజు లుండి పోయాంవంతే! వచ్చినాటినుంచీ వియ్యాల వారింటే ఔ పోసన. నిజానికి యింకా ఉండవలసిన చోట్లున్నాయి. ఏకంగా నెల్రోజులు సెలవు పెట్టేశాన్లే. మా మాటకేంగాని మీరంతా కులాసావేగదా! అదే కావలసింది. అంథా తలో మూలా విసిరేసినట్టయిపోయాం. సత్తెంకూడా యింటిదగ్గిర లేకుండా అయిపోవడం చూడు తమాషా! మన చేతిలో ఏం వ్లేదు!"

సీతప్ప సోదంతా పూర్తికానిచ్చి, "మీ సత్యం విషయం మీకు సరిగా తెలీమలాగుంది. వాణ్ణి వాడి మావగారూ, బావమరిదీ భానిసకన్న హీనంగా చూసి, వాడిచేత జీతం ఒత్తెం లేని వెట్టిచాకిరీ చేయిస్తున్నారు. యింటి మగవాళ్లు గౌరవించనివాణ్ణి ఆడవాళ్లు గౌరవిస్తారా? సత్యం ఎందుకు పడి ఉంటున్నాడో నా కర్థం కాలేదు. వాడి బావమరిది నరుసు ఇవాళ పెద్ద వ్యాపారస్తు డయాడు, ప్రెస్సు పెట్టాడు! కాని వాడికి పెట్టుబడి పెట్టింది సత్యం. సత్యం కాకపోతే నే నమ్మలేండి. ఆ డబ్బు నా చేతికింకా

తిరిగి రాలేదు. రాకపోతే పీడాపాయిరి. వాడిపట్ల వాళ్ళు కృతజ్ఞత అయినా లేకుండా ఉండటం చూస్తే నాకు మండి పోతోంది," అన్నాడు భద్రాచలం.

"అలాగా?" అన్నాడు సీతప్ప. కాని అల్లుడిమాట ఆయన ఒక్కటికూడా నమ్మలేదు. తన అల్లుడి అభిప్రాయాలు అదో మోస్తరుగా ఉంటాయని సీతప్ప దృఢ విశ్వాసం.

"ప్రెస్సు పెట్టినాక సత్యాన్ని మేనేజరుగా వేశారు. ప్రెస్సుకు డబ్బు బాగా వస్తున్నది. మనవాడికి నెలకు మూడొందలిస్తున్నట్లు లెక్కల్లో రాస్తారుట. చేతికి దమ్మిడీ యివ్వరు. పనివాళ్ళకి ఎప్పుడూ రెండు మూడునెల్ల జీతాలు బాకీయే. నరుసు సాధారణంగా ప్రెస్సుకేసి వెళ్ళడు. పబ్లికేషను ఆఫీసుకు వెళతాడు. యెప్పుడైనా ప్రెస్సుకు వెడితే పనివాళ్ళు జీతాలడుగుతారు. 'అరె, మీ కింకా కిందటి నెల జీతంకూడా రాలేదా? మీ మేనేజ రేం చేస్తున్నాడు? అతన్నడిగి తీసుకోండి,' అంటాట్ట. వాళ్ళు సత్యాన్నడిగితే తన చేతుల్లో ఏమీ లేదని చెప్పక, బిల్లు కలెక్టు కావాలనో, యింకో వారానికిస్తామనో, నరుసు ఏం చెప్పమంటే అదే చెబుతాడు. సత్యం రెండుసార్లు పనివాళ్ళచేత తన్నులుకూడా తిన్నాడు. తన్నినవాళ్ళను పనిలోనుంచి తీసేసారు — అదీ సత్యానికి వాళ్ళు చేసిన న్యాయం.

"ఆ మాట అలావుంచి, ఈ పని చెయ్యటంలో నరుసు సత్యంమీద వేటగాడి కుయుక్తులన్నీ ప్రయోగిస్తున్నాడు — సత్యంమీద ముగ్గుర్ని నిఘా పెట్టాడు. ఒకడు గేటుకాపలావాడు, సత్యం ఎప్పుడు వచ్చేదీ, ఎప్పుడు వెళ్ళేదీ

వాడు నర్సుకు రోజూ చెబుతూంటాడు. వాడికి సత్యంఅంటే ఏం ఖాతరుంటుందీ; సత్యాన్ని చూసి సలాం పెట్టడు. వాడి మొహానే బీడీపొగ ఊత్తాడు. సత్యం దారితప్పి ఏదన్నా అడిగితే జవాబు చెప్పడు; చెప్పినా, నాకు తెలీదు పొమ్మంటాడు. బైండింగ్ సెక్షన్ మేస్త్రీ సత్యంమీద మరో సీఐడీ. వీళ్లిద్దరూ తనను పోలీసులల్లే కాస్తున్నారని తెలిసినప్పటినుంచీ వాళ్ళను చూసి ఉచ్చ పోసుకుంటు న్నాడు! నే ననేదీ, ఏవిటిదంతా? యింతకన్న ఏ సిగరెట్టు దుకాణమో పెట్టుకుంటే సరిపోదా? యింతకన్న లక్షరెట్లు సుఖంగా బతకవచ్చునే!—"

అలుడు మాట్లాడుతున్నంతసేపూ సీతప్ప అతని మాటలు లీలగా మాత్రమే వింటూ వచ్చాడు. ఎన్నడూ తనతో ముచ్చి మూడు మాటలు మించి మాటాడని అల్లుడు ఇంతసేపు తనతో మాట్లాడటం చూసి సీతప్ప మనస్సు ఆనందడోలల్లో ఊగిసలాడింది. అల్లుడు తనపట్ల యింత సుముఖం అయినా డంటేనున్నూ దీని వెనక యింకా ఎంత శుభంవ్రూ సంతోషానందాలూ ఉన్నవో మనం చెప్పలేం. ఎవరు చూశారు? యితను మళ్ళీ సావిదేవిని ఏలుకున్నా ఏలుకోవచ్చు. సత్యం గురించి యింత యిదిగా చెబుతున్నా డంటే అది శుభ శకునవేనూ! తనతో యింత ఆప్యా యంగా మాట్లాడుతున్నాడంటే అదీనున్నూ మరింత శుభ వేగాని మరోహాటి కాదుగదా! అతను అలా ఆప్యా యంగా సమస్తమైనటువంటి విషయాలూనున్నూ ఆత్మీ యంగా మాట్లాడుతున్నప్పుడు తానుకూడా అంతసేపూ

యిష్టాగోష్టి మాట్లాడి తీరాలిసిందే తప్పవిడిచి గత్యంతరం లేదుగదా. అంచేత సీతప్ప అతను మాట్లాడ్డం మానగానే ఏవేం కబుర్లు మాట్లాడదాంవా అని ఆలోచనలో పడ్డాడు.

కోడలి వేవిళ్లూ, వంటంతా ఉల్లిపాయల మయం చెయ్యటంవ్వూ, దానికి శ్రీరామచంద్రమూర్తివారు (లేదా ఏడుకొండల వాడు) పూనటవ్వూ, అది రామకోటి కాయితాలతో నెయ్యి కరగబెట్టడంవ్వూ – ఈ భోగట్టా యావత్తూ చాలాసేపు, వివరంగా, అల్లుడికి మధ్య మధ్య సంశయాలేవీ కలక్కుండా, చెప్పేద్దామనుకున్నాడు. యింతలో అల్లుడి కంఠ ధ్వని నిలిచిపోయినట్టయి సీతప్ప అధ్యాట్టున అనుకోని విషయం ఆరంభించాడు.

"అవునవును. నాడంటే వాళ్ళందరికీకూడానున్నా యెంతో యిదీ, యెంతో అదీనున్నా! యితర్లమాటెందుకోయ్! ఆ పిల్లుంది చూశావ్? మా కోడలు – రేపు కంటుందనగా కూడానున్నా వాణ్ణి తన చెంతనుంచి అసంటా వెళ్ళనిచ్చింది కాదంటే నమ్మంతేనూ!—"

సీతప్ప యింకా ఏవేం చెప్పేవాడో మనకు తెలీదు. తాను చెప్పబోయే విషయాలు తం అల్లుడి మనసు సావిదేవి కేసి తిప్పేవిగా ఉంటాయని సీతప్పమనసులో ఒకఅస్పష్టమైన నమ్మకం ఏర్పడుతూ ఏర్పడుతూ ఉండింది. తగినంత వ్యవధే ఉంటే అంతపని చేసే ఉండును. కానీ భద్రాచలం సీతప్పకి రాహువల్లే అడ్డు తగిలి, "అంచేత నేను మీకిచ్చే సలహా ఏవిటంటే మీరు తక్షణమే మీ సత్యాన్ని తీసుకుని పట్నం వెళ్లిపొండి," అనేశాడు.

సీతప్పకు, తాడని పట్టుకుంటే పామై కరిచినట్టయింది; మొహం ఎదటనే బాంబు పేలినట్టయింది. అల్లుడు యింత సేపూ మాట్లాడిన ఆప్యాయతకూ, ఆఖరికి అతనిచ్చే ఈ భయంకరమైన సలహాకూ ఏవీ సంబంధంలేదు! "తక్షణమే" అన్నమాట, "పట్నం వెళ్ళిపొండి" అన్నమాటా రెండు గాలాలై సీతప్ప గొంతులో గుచ్చుకున్నాయి.

"పట్నంవా? వెళ్ళిపోవడవా? జలప్రళయం! అమాంతంగా సముద్రం పొంగేసి వెయ్యి నిలువుల నీరొచ్చి పట్నం మీాద ఇరవై నాలుఘ్ఘంటల పాటలాగే ఉండిపోతుందవటని రవణాశ్రం వాళ్లు చెబున్నా రవతా. సహా వందుకే ఆఫీసుకు సెలవుపెట్టే సొచ్చేశాం! ఫిబ్రవరి నాలుగూ, అయిదూ దాటితేగాని ప్రయాణంలేదు. అదేనా రైల్లూగట్రా నడిస్తే మాట! అయిపోయింది. దగ్గిరసాపడింది. వారింట ఓ వారం రోజులున్నావా? మీా యింట ఓ వారం పదిరోజులుండక యెటొచ్చీ తప్పదుగదా! అలా _ అలా _ రోజులు గడిచేపోతాయి. ప్రళయం రానూ వస్తుంది. పోనూ పోత్రుంది. కాలం ఒకరికోసం ఆగేదా; యేఁన్నానా? మనంవా, దాని చేతిలో కీలుబొమ్మలంతప్ప విడిచి మరేం కాదుగదా!"

తాను చెప్పిందేదీ మావగారి చెవికెక్కలేదనీ, చెవిటివాడిముందు శంఖూదినట్టయిందనీ గ్రహించి భద్రాచలం మాట్లాడక ఊరుకున్నాడు.

సీతప్ప ఆలోచించాడు; తాను మాటవరసగా _

ఎంతో లౌక్యంగానూ, చాకచక్యంగానూ - అందించిన మాటను అల్లుడి దగ్గర్నుంచి సరయిన జవాబు రాలేదు. 'అయ్యో, మీరు మా యింటో వారనేవిటి, అథమం రెండువారాలన్నా ఉండకుండాఎలాగా? రాక రాకొచ్చారు కదా, మళ్ళీ ఎప్పుడొస్తారో ఏవిటోనూ! దూరా భారం కూడా నాయిరి,' అనటాని అల్లుడు అని ఉంటే సొంపుగా ఉండిపోను. అతను అలా అనకపోగా అసలు మాట్లాడడవే మానేసి బెల్లం గొట్టిన రాయిలా అయి వూరుకున్నాడు.

అయినా సీతప్ప ఓటమి అంగీకరించలేదు. తన యెత్తు సగం పారినట్టే భావించాడు. మౌనం అర్ధాంగీకారవన్నారు కాదూ? అల్లుడు మౌనంతోనే అర్ధంగీకారం తెలపనే తెలిపాడు, మరేవిటి? భద్రాచలం, 'మీరు మా యింటో వారం, పదిరోజు లుండటవేవిటి? ఎంతమాత్రం వల్లపడదు!' అనకపోవటవే సీతప్ప ప్రాణానికి అంగీకార సూచకవయింది!

## 14

"ఏం, నాన్నా? పైన అల్లుడుగారూ నువ్వూ అదే పనిగా మాట్లాడుతున్నారు? మీ గొంతులు విని అమ్మ ఒకటే నవ్వు. కలవక కలవక కలిస్తే ఇలా ఇద్దరూ అంటుకుపోయారుగదా, ఒక చోటే ఉండేవాళ్ళయితే వాళ్ళని

విడదీయగలుగుదుమా?' అంటోందమ్మ." అన్నది సావిత్రీదేవి సీతప్పతో.

సీతప్ప హృదయం ఈ మాటలకు పొంగిపోయింది. ఆయన రావమ్మకేసి ముసిముసినవ్వులు నవ్వుతూ చూశాడు. రావమ్మ జేవురించిన మొహాన్ని దించేసుకుంది. ఎందుకంటే సావిత్రీదేవి చెప్పిన మాటలు ఆవిడ అననేలేదు. సావిత్రీదేవి మనసులో పుట్టిన అభిప్రాయాన్ని తల్లికి అంటగట్టింది.

"చూడు, నాన్నా అమ్మ ఈపూట వస్తుంటాను గాని, వారింట వచ్చి మంచినీళ్ళయినా తాగనంటున్నది. ఆవిడతోబాటు నీకూ్కడా ఇంతబియ్యం కడిగి పెడుదునా?" అన్నది సావిత్రీదేవి.

"అడగాలి టే వెర్రిదానా? నిక్షేపంలా పెట్టు. వారింట ఇంతకాలవాయి ఉండనే ఉన్నారుగదా, మాయింట ఎందుకుండరావటాని అతను అననే అన్నాడు. అక్కరపడి వచ్చీం దేమో వారింటికాయిరి, ఇక్కడికొస్తే చుట్టపు చూపుగానే గదా రావాలి? అంచేత రావడానికి మొహమాట పడ్డాం తప్ప విడిచి కోడలు పురుటిస్నానం చేసిన మర్నాడే ఇలా వచ్చేసినా వచ్చేసుండొచ్చు! ఏవిటో?" అన్నాడు సీతప్ప.

"హమ్మయ్యా! ఆ కసింతముక్కా ఆయనోటే వచ్చేసిందిగద! అమ్మా, నువ్వు కూడా ఇలా వంటింటో కొచ్చి నాన్న కేవేంచేస్తేనచ్చుతుందో చూడూ!" అన్నది సావిత్రీదేవి.

ఇద్దరాడాళ్ళూ వంటింటో చేరారు. రావమ్మగారు

కూరలబుట్ట దగ్గరగా లాక్కుని, కూరలన్నీ బోర్లించి. ఏ జాతి కా జాతి వేరుచేస్తూ, "అనుకోగూడదుగాని, వాళ్ళే వన్న మనుషులే? లాంఛనగానన్నా ఒక్కపూట నిన్నుపిలిచి భోజనం పెట్టారు కారుగదా! ఆడబిడ్డ—అందులోనూ ఎద రింటో ఉన్న మనిషి!— అవకాశం చిక్కినప్పుడల్లా ఇంత పసుపూ, కుంకువా, పండూ, ఫలంవూ ఇచ్చుకోవూ! ఛీ, ఛీ!" అన్నది.

"వాళ్ళవూసు నాదగ్గిరె త్తకమ్మా! నాకు చిర్రెత్తు కొస్తుందీ!" అన్నది సావిదేవి, చేటలో పోసిఉన్న కంది పప్పులో రాళ్లేరుతూ.

"అబ్బిగాడి పెళ్ళి నీచేతి మీదుగా జరిగిందికదా, వాళ్ళకాపాటి కృతజ్ఞతయినా ఉండొద్దూ?" అన్నది రావమ్మ. వంకాయలను పక్కకునెట్టి మిగతా కూరలు మళ్లీ బుట్టలో పెడుతూ.

తల్లి అన్నమాటకి సావిదేవి గుండెల్లో క్షణంపాటు రైళ్ళు పరిగెత్తాయి. "ఈ దిక్కుమాలిన సమ్మంధం నువ్వే కుదిర్చావు," అని తల్లిగాని, తండ్రిగాని ఎక్కడ అని పోతా రోనన్న భయం ఆమె మెదళ్లో పులిలా పొంచిఉంది. సత్యం పెళ్ళిలో తాను నిర్వహించిన పాత్రను మరిచి పోవటానికి ఆమె ప్రయత్నిస్తున్నది. "అబ్బిగాడి పెళ్ళి నీచేతి మీదుగా" అని తల్లి అంటుండగానే సావిదేవి మెదడులో పొంచి ఉన్న పులి భయంకరంగా గాండ్రించింది. కాని నింద తన మీదుగా పొయ్యేసరికి సావిదేవి తెప్పరిల్లుకుని, "ఎంత సత్తెకాలపు

దానివమ్మా! వాళ్ళకి కృతజ్ఞతలు కూడానా? కర్కోటకులు" అన్నది.

"అయితే చూడమ్మా, ఇవేనా ఉన్న వంకాయలూ? ఇద్దరూ ఇద్దరూ నలుగురూ, ఇద్దరూ ఆరుగురూ—చిత్తు గాడితో కూడా సరిపోతాయా ?" అన్నది రావమ్మ.

సావిదేవి తలమీది కెగరేసి, "వాళ్ళ వంట వేరుగా" అన్నది.

"అదేమిటీ? మావగారి పంక్తిని అల్లుడుగారు ఫోపోసన పట్టకపోతే ఎలాగా ?" అన్నది రావమ్మ. చాలా ఉదాత్తమైన భావం వ్యక్తం చేస్తున్న సంతృప్తితో దీర్ఘాలు తీస్తూ.

సీతప్పలో ఏదో అవ్యక్తమైన ఉత్సాహం ఆయనలో కనిపించి నెలలూ, సంవత్సరాలూ అయినట్టుంది. తన జీవితపు మోటారుకారు చాలా కాలంగా డొంకకి అడ్డం పడి నడిచి అకస్మాత్తుగా నిక్షేపంలాంటి తార్రోడ్డెక్కినట్టుగా ఆయనకి తోచింది.

"నే చూస్తున్నాగా ! ఇలాటి మార్పు మనసులో కలగడ మేమిటి. వెంటనే అన్నీ కలిసిరావడ మారంభిస్తాయి. నువ్వు మట్టిపట్టుగో గాక అది బంగారవయి వూరుకుంటుందం తేనూ" అని ఆయన తనలో అనుకుంటూ. లంకకు ఎగరడానికి సిద్ధపడుతున్న హనుమంతుల్లా అయిపోయాడు.

ఈ ఉత్సాహంతో తాను ఏం చెయ్యాలిప్పుడు? ఆడాళ్ళిద్దరూ వంటింటో చేరిపోయారు. తానుకూడా వాళ్ళతో చేరి, "ఇదుగో, మీరేవ్వీ భయపడ నవసరం లేదు. మనకెవ్వరికీనున్నా నవగ్రహకూటి భయంగానీ, జలప్రళయ భయం

గానీ కించిత్తు కూడా నున్నా ఉండదంటే ఉండదంతే!" అని ప్రోత్సాహం ఇద్దాంవా యేవిటని కాస్సేపు ఆలోచించాడు. పోనీ మరోమారు మెట్లెక్కి పైకి వెళ్ళి, అల్లుడు వ్యవహర్త గనక, పట్నంలో తను ఆఫీసు కథా కమామీషూ, అందులో తాను నిర్వహిస్తున్న గొప్ప బాధ్యతా, తనమీద యజమానికి గల సదభిప్రాయంవూ వగైరా సవాలక్ష విషయాలు చెబుదాంవా ఏవిటని కొంచెంసేపు ఆలోచించాడు. ఛస్, ఇదంతా కాదు! ఓ అరఘంటపాటు అలా నాలుగువీధులూ చుట్టేసిచక్కా వచ్చేసరికి వంటా గట్రా తయారయుంటుంది. వెంటనే స్నాన సంధ్యలు కానిచ్చుకోవడమూనున్నా, భోంచేసి విశ్రాంతి తీసుకుని కబుర్లాడుకోవడమూనున్నా అని నిర్ధారణ చేసుకుని, "ఇదుగోనబ్రోయ్, నేనలా రెండు బజార్లూ తిరిగి ఇక్కడున్నట్టొచ్చేస్తానూ! మళ్ళీ నాకోసం వెతుక్కోగల్రు!" అని కేకపెట్టి బయలుదేరాడు.

## 15

సీతప్ప అల్లుడితో మాట్లాడుతుండే సమయంలో ప్రెస్సులో అష్టగ్రిహకూటంలాంటి దొకటి ఆరంభమయింది.

బైండింగు మేస్త్రీ సత్యం దగ్గరికొచ్చి, "ఇవాళ పని వాళ్లందరికీ ఆటవిడుపేటి ?" అని అడిగాడు.

సత్యం పిచ్చిమొహం వేసి, "అంటే?" అన్నాడు.

"నాకు మాత్ర మేటితెల్సు? ఎవ్వరూ ఏం జెయ్యటం లేదు. ఎందుకు చెయ్యరో కనుక్కోండి మరి" అన్నాడు బైండింగు మేస్త్రీ.

ఎవరో తోసినట్టు సత్యం తన గదిలో నుంచి కంపోజింగు గదిలోకి వెళ్ళాడు. కంపోజిటర్లు కేసుల నానుకుని నిలబడి ఏవో మాట్లాడుకుంటున్నారు.

"మీరంతా పనిచెయ్యరేం? మేటరందలేదా?"

"మేటర్కోసం కాదు పంతులూ! జీతాల్కోసం నుంచున్నాం," అన్నాడొక బిరుసు క్రాపువాడు.

"జీతా లివాళిస్తారని ఎవరన్నారూ?"

"యివాళైనా యివ్వకపోతారా అని మేవే అనుకున్నాం."

"యివాళ జీతాల్లేవు."

"అయితే పనీలేదు!"

"ఇదేవిటి? సమ్మా?" అని సత్యం అడిగాడు.

"పేరేం పెడితే యేం పంతులూ? మాచేత రెండ్జేసి నెల్లపని అరువు పుచ్చుకుంటుంటే దాని పేరేటని మే వడిగాంవా? అదేటో మాకు తెలుసు. ఇదేటో మీకూ తెలుసు! మాడబ్బులు మాకు పారెయ్యండి, అందాకా స్టిక్కులు పట్టం."

ఇది అవాంతర పరిస్థితి. ఇలా ఈ ప్రెస్సు పెట్టాక ఎన్నడూ జరగలేదు. ఈ ప్రెస్సులో పనిచేసే వర్కర్లకి యూనియనుకూడా ఇంకాలేదు. ఒకరూ ఇద్దరూ పనికి

మొరాయిస్తే బయటికి నడవమనవచ్చునన్నది సత్యానికి అనుభవంద్వారా తెలుసు. కాని అందరూ కూడదలుచుకున్న పనిమానేస్తే ఏంచెయ్యాలో సత్యానికి తెలియదు. అతను స్వబుద్ధి ఉపయోగించే అలవాటు పూర్తిగా పోగొట్టుకున్నాడు. మొదట్లో అతను స్వబుద్ధి ఉపయోగించి చేసిన ప్రతినిర్ణయమూ బుద్ధితక్కువ నిర్ణయమని నరుసు అవలీలగా తేల్చేశాడు.

అందుచేత సత్యం ఉన్న పరిస్థితి గురించి నరుసుకు చెప్పి కర్తవ్యం తెలుసుకుందామని పబ్లికేషన్ ఆఫీసుకు బయలుదేరాడు. మధ్యదారిలో సీతప్ప తగిలాడు.

"నువ్వురా, సత్యం! యీదారాపాన ఎవరో అనుకున్నానుస్మీ! అవిసరేగానీ, ఈపూట నేనూ, అమ్మా సోవి దేవక్క యింట భోంచేస్తున్నాం. మీ బావా, అమ్మాకూడా కాదుకూడదని బలవంత పెట్టేశారనుకో. వాళ్ళడిగిందికూడా నున్నా సబువేగాని దీనికింతదూరం బతిమాలాలా ఏవర్రా అనిచెప్పేసి, అలాగే వంటజెయ్యండావటాన్నాం. ఒక్క పొరపాటు దొర్లిపోయిందిరా. ఏవిటనడుగూ, నేనూ, అమ్మా, సోవెక్కా. మీ బావా, ఆ-అమ్మాయీ, చిత్తు గాడూ-యింతమందిపీనున్నా ఒకేబంతిని కూచుని భోజనాలు చెయ్యడం అపూర్వవేసంటావా? అలాటప్పుడు నువ్వుకూడా మాతోకలిసి భోంచేస్తే ఇంకడిగావూ? మరేవోనున్నా, మద్దినాళను వే వేళకే పనితెమిలి భోజనానికొస్తావో తెలీదాయిరి. ఇన్నాళ్ళయి చూస్తుంటేనిగా, నిన్నొకహావేళ కొస్సిని, ఇవాళ మరోహావేళ కొస్సిని. అందుచేత నాసలహా

ఏవిటంటేనున్నూ, రాత్రికి అంతా కలిసికూచుందాం. బ్రహ్మానందంగా ఉంటుంది. ఇంకా నూతిలో చేదెయ్యలేదు గనక వీల్లేదుగాని మీ ఆవిడకూడా ఉంటే దివ్యంగా ఉంటుంది. సందేహావేవిటి? అబ్బో!—"

సీతప్ప అలా ఎంతసేపు చెప్పుకుపోయేవాడో తెలీదు. తాను మాట్లాడు తూన్నంతసేపూ "అబ్బిగాడు" కడుపు నొప్పితో బాధపడుతున్న వాడిమొహం పెట్టి 'ఈ బ్రాహ్మ డెప్పటికి తెవులుతాడా?, అని చూస్తుండడం సీతప్ప గమనించే లేదు. వాడు తనమాటలు వినడవేలేదని కూడా ఆ పిచ్చి బ్రాహ్మడికి తట్టలేదు. సత్యం చిట్టచివరికి ఏదో అన బోయే ధోరణిలో రెండడుగులు వేసినాకగాని సీతప్పకు జాగ్రదావస్థ కలగలేదు. అప్పుడనిపించింది, ఏవిటిచెప్మా? అబ్బి మామూలు ధోరణిలో లేడు.! ఏదో పెద్ద సమస్య విరుచుకు మీదపడ్డ వాళ్ళాఉంది వాడిమొహం! మనిషి చూడబోతేనా నీరసంగానూ, నిరుత్సాహంగానూ, బొత్తిగా యిదిగానూ, ఏవంత యిదిలేకుండానూ ఉన్నాడు...

"ఏవిరా, సత్తెం? అలా బెంబేలు బడిపోయున్నా వేవిటి? అంతా కులాసా నేగదా? అన్నట్టడగవే మరిచాను. ఇలా ఎక్కణ్నుంచి రావడం? ప్రయాణ వెందాకా? నీకు తొందరపనిగాని వుంటే నీతోనేనూ నాలుగడుగులేస్తాను. ఇంతలో వచ్చే నష్టవేవిటీ?" అన్నాడు సీతప్ప.

"నర్సును చూడబోతున్నాను. ప్రెస్సులో పేచీవచ్చి పడింది," అని, ఇంకేవీ చెప్పకుండా సత్యం జారితీశాడు.

సీతప్ప కొడుకు వెనకే పరుగు నడక నడుస్తూ, పేచీయే! వచ్చిందా? ప్రెస్సులోనే! ఏవిటిదారి? యీ పేచీలున్నాయి చూస్తూ? ఇవి రానేకూడదు! వచ్చాయో చెండుకు తినే స్తాయి. ఒహంతట వదలవు. చిన్నపేచీని సరిచెయ్యాలనుకుంటే పెద్దపేచీ అయికూచుంటుంది, చాలాకష్టం. అందులోనూ బాధ్యత గలవాడిదే భారం. భారం మోసేవాడికి తెలుస్తుంది, నువు భారం మోస్తున్నా వేవనుకున్నావేవిటోనూ! అంచేతను—జాగ్రత్తస్మి బహు వోడుపుగా, వుపాయంగా పేచీ సరిచేసేసెయ్యి... అన్నట్టు ఎవరితో వచ్చిందీ పేచీ? చెవిని వేశావుగావు", అన్నాడు.

"పనివాళ్ళు పనిమానేసి మీటింగు చేస్తున్నారు. పని చెయ్యరేవర్రా అంటే జీతాలివ్వండే చెయ్య వంటున్నారు." అన్నాడు సత్యం.

సీతప్ప ఆగిపొయ్యాడు. ఇది నడుస్తూ మాట్లాడవలసిన విషయంకాదు. దీన్నిగురించి అనవలసిందీ వినవలసిందీ బోలెడుంది, కాని సత్యం ఆగక మరినాలుగడుగులేసి ఒకగేటు గుండా ఒక ఇంటో ప్రవేశించాడు. ఒక్కపరుగుతీసి కొడుకు నందుకున్నాడు సీతప్ప. ఇద్దరూ నర్సుకూచున్న గదిలో కెళ్ళారు.

"ఏవిటి సత్తెం? ఎందుకిలావచ్చావు? కొత్తపుస్తకం కంపోజారంభించారా? పాతదింకా రెండుఫారాలుకాదూ ట్రైయికవాలీ? ఇవాళ సాయంకాలాని కన్నా అది దిగిపోవాలి—" అన్నాడు నర్సు.

"ప్రెస్సువాళ్ళు పనిమానేసి కబుర్లాడుకుంటున్నారు. సమ్మెలాగుంది." అన్నాడు సత్యం.

"వాళ్ళ శ్రాద్ధమేంగాదూ ? పనిచెయ్యని వాళ్ళని బయటికి పొమ్మనక పోయావా?"

"ఎవరూ పంజెయ్యటంలేదు బైండర్లకి పనీగాడా లేదు—ఆ రెండు ఫారాలూ ప్రింటయితేగాని."

నర్సు కొంచెం ఆలోచించి, "ఎందుకు పని చెయ్యరుటా?" అనడిగాడు.

"జీతం కావాలిట"

ఇక సీతప్ప ఉండబట్టలేక పోయాడు.

"ఈ కార్మికులెప్పుడూ ఇంతేనూ. వట్టిపేచీఖోర్లు. వాళ్ళకెంతసేపూ డబ్బూ, డబ్బూ, డబ్బూ ! ఒక్కొక్కప్పుడు మన చేతిలో డబ్బు మెసలక కాస్తాలిస్యమవు తుందనుకో. సమ్మె చేస్తామనటాని హడలగొట్టేస్తారు. మనపిలక వాళ్ళ చేతికి చిక్కినట్టేనూ. అప్పుడు మనమేం జేస్తాం? తల తాకట్టు పెట్టో, ఆడంగుల మెళ్లో నగలు కుదవబెట్టో వాళ్ళడబ్బు వాళ్ళయదాన పారేస్తాం. అంతటితో ఆగుతారా ? యింక్రిమెంట్లు కావాలంటారు. బోనసు లేవంటారు. ఆ కమ్యూనిస్టులు వీళ్ళకి కొమ్ములు తెప్పించారు. రష్యాలో ఉండిన రాజభవనాలన్నీ కార్మికులాక్రమించారని తెలిసి నప్పణ్ణించీనున్నూ మన దేశంలోకూడా ప్రతిపనివాడికీ ఏ రాజభవనంలోచేర పోదామా అన్న దూరాశేనూ!—నిజవాలో

చిస్తే సమ్మె వాళ్ళకే నష్టం. ఒకపూట కూలిడబ్బులు పోయినా పోయిలో పిల్లి లేవదే! అలాని వాళ్ళకేవన్నా లక్ష్యం వుందా? అంచేతను ఈ కార్మికులు సమ్మె అన్నప్పు డల్లానున్నూ తల చితగొట్టెయ్యవలిసిందే. ఆ పని మనవల్ల కాదూ? పోలీసుల్ని ఆపళంగా కేకెట్టెయ్యొచ్చు. వీళ్ళపని వాళ్ళే చూస్తారు."

సీతప్ప మాటలు గంభీరంగానే వున్నాయిగాని గొంతు వణుకుతున్నది. మనిషీ వణుకుతున్నాడు. ఆయన కళ్ళు బెదురు గొడ్డులా ఉన్నాయి.

తండ్రి యిచ్చే దీర్ఘోపన్యాసాలు ఒకప్పుడు సత్యం చెవులకి అమృతప్రాయంగా ఉండేవి. అవి విని చాలా కాలం కావటం చేతనో, సీతప్పలో జ్ఞానం తగ్గటం చేతనో ఏవో గాని, వాడి చెవులకి తండ్రిమాట లిప్పుడు వట్టి పిప్పిలా గున్నాయి. ఈ ఊకదంపు కబుర్లు విని నర్సు చిరాకు పడతా డేవోనని కూడా సత్యం భయపడ్డాడు. కాని నర్సు సీతప్ప మాటలను పరమానందంతో విన్నాడు.

అంతా విని అతను: "ఇన్నాళ్లూ ప్రెస్సు మేనేజి చేస్తున్నా, మీకు తెలిసిన విషయా లింకా సత్యానికి తెలీవు," అన్నాడు. సీతప్ప మొహం ఆనందంతో జేవురిం చింది. కళ్లలోకి ఆనందబాష్పాలు కూడా దిగాయి.

నర్సు సత్యం కేసి తిరిగి చాలా సౌమ్యంగా, "ఇవాళ పూర్తయే పుస్తకం విడుదల అయేదాకా డబ్బులు రావని చెప్పు. పేపర్లోనూ, పుస్తకాలలోనూ లక్షరూపాయలు లా

కప్పయి వున్నది. చెబితే అర్థంగాని పాపాయిలా? నువ్వు చెప్పవలిసిన తీరుగా చెబితే వాళ్ళు వినకేం జేస్తారూ ?" అన్నాడు.

# 16

సీతప్పకి నిప్పులమీద ఉన్నట్టున్నది. ప్రెస్సులో ఆనాటినుంచీ పని జరగడంలేదు. అంటే సమ్మె జరుగుతోందని వేరే చెప్పాలా? సమ్మెలు మహాచెడ్డవి. వాటిని గురించి సీతప్పకు, అబ్బో! బోలెడంత తెలుసు. కార్మికులు రెచ్చిపోయాకనే ఈ సమ్మెలొచ్చాయి. అది వరకిలా వుండేదా ? 'ఒరే, నువ్వీ పని చేసీ,' అవటాంనంటేపనివాళ్ళు చేసుకు చక్కా పోయీవారు. ఇప్పుడు వాళ్ళకొక్కమ్మ లొచ్చేశాయి. ఒక్క సంగతి చూడ్రాదూ?పనిలేని వెధవలు సమ్మె చేయగల్దురా? నోట్లోకి నాలుగు మెతుకులు వెళ్లే వెధవలకే గోరోజనం. అంచేత నేచెప్పొచ్చేదేంటంటే నువ్వూ యీ కార్మికుల్ని సహం చచ్చిన పాములల్లే ఉంచితేనే చెప్పిన మాట వింటారు. యజమాని అనగా ఎవడు? నలుగురి కింత గంజిపోసే వాడు గద! సమ్మె అని సాకుపెట్టి యజమాన్ని కార్మికులనే మాటలు అవీ ఇవీ గావు. ఛీ, ఛీ!

ఇలాంటివి ఎన్నో విషయాలు అందరికీ రోజుల తరబడి చెప్పాలనుంది సీతప్పకి. కాని ఎవరూ విన్రు. అల్లుడు

మాటమధ్యనే బజారు పనుందవటాని లేచి వెళ్ళిపోయాడు. రావమ్మ అంతా విని, "అచ్చాఫీసులో పని నిల్చిపోడం నుంచి అబ్బిగాడి శావమరిదికి చెప్పరాని నష్టం వస్తోందిట గాదూ?" అని అడిగింది.

పనివాళ్ళు బైఠాయింపు సమ్మె చెయ్యాలని ప్రయత్నించారు. కాని పోలీసులువచ్చి వాళ్ళని బయటికి సాగనంపారు. నప్పు ప్రెస్సును ఇతర పనివాళ్ళతో నడపటానికి ప్రయత్నించాడు. దొమ్మి జరిగింది. కొందరికి చిన్న గాయాలు తగిలాయి. పోలీసులు ఇద్దరు ముగ్గురు సమ్మెదార్లను పట్టుకుపోయారు.

సమ్మె సాగిన మూడోనాడు సాయంకాలం సీతప్ప నడినెత్తిన పిడుగు సూటిగా పడింది. ఇంతపని జరుగుతుందని ఆయన కల్లోకూడా అనుకోలేదు. ఈ మూడు రోజులూ అయిపూ అంతూ లేని సత్యం—వాడి బుర్ర ఎక్కడ పగల గొట్టేస్తారో నని సీతప్ప గుండె పీచు పీచుమంటూనే ఉంది_ పొద్దూకువాట్ల భావగారి దగ్గిరికి వెళ్లి చాలా సేపేదో మాట్లాడాడు. సమ్మె విషయవే అయుంటుందని సీతప్ప అనుకున్నప్పటికీ ఇంత దారుణం శంకించే లేదు.

కొంచెం సేపయాక చిత్తుగా డొచ్చి, "తాతయ్యా, నిన్నోసారి నాన్నగారు పైకి రమ్మంటున్నారు" అని చెప్పే సరికి, లేతగరికి కేసి పరిగెత్తే లేడిపిల్లలా, సీతప్ప చెంగు చెంగున గెంతుకుంటూ, ముఖంలో చిరునవ్వులు చిందుతూ పైకివెళ్లాడు.

కొంతసేపయాక ఆయన దిగి వచ్చేసరికి పాదాలు బరువుగా పడుతున్నాయి. మొహం పెంకులా ఉంది. కళ్ళు బెదురుగా వున్నాయి. నెత్తిన బరువుమోసే వాడల్లే ఊపిరందక కొట్టుకుంటున్నాడు.

ఆయన్ను చూస్తూనే రావమ్మగారు, "ఏం జరిగిందేవిటండీ?" అని ఆదుర్దాగా అడిగింది. ఇంచుమించు అదే క్షణంలో సావిదేవి, "ఏవన్నారు, నాన్నా?" అనడిగింది.

సీతప్ప నోట మాట రాలేదు. మూడుసార్లు మాట్లాడబోతే మూడుసార్లూ పెదవులు వొణికాయి. చివరకాయన, "ఈ వెధవ—ప్పె ప్పె ప్పె—పనివాళ్ళతో జిజిజి—జజజ—చేరిపోయాట్ట." అన్నాడు. ఆయన నుదిటిమీదినుంచి చెవట చుక్కలు కళ్ళలోకి కారుతున్నాయి.

"అబ్బిగాడే!" అన్నది రావమ్మ చాలా పలచని ఆశ్చర్యంతో.

"ఎందుకు చేరాట్టా?" అన్నది సావిదేవి.

సీతప్ప చలిజ్వరం వచ్చినట్టు ఇప్పుడు నిలువునా వణుకుతున్నాడు. సమాధానం చెప్పేస్థితిలో లేడు.

ఈ అవకాశం చూసుకుని చిత్తుగాడు వెనకనించి, "ఆ రావస్వావి లేడూ, అతను మావయ్యాని పిచ్చినుక్క అని తిట్టాట్ట" అని కేకెట్టాడు.

"ఆ రావస్వావెవడు?" అన్నది రావమ్మ.

"ప్రెస్సులో పంజేస్తాడు" అన్నాడు చిత్తుగాడు చెవిటివాళ్ళకోసం మాట్లాడుతున్నట్టు

"తనని పిచ్చికుక్క అని తిట్టినందుకు వీడు వాళ్ళతో చేరిపోయాడా? అవురా!" అన్నది రావమ్మ, ఆట్టే వికారం ఏవీ లేకుండానే.

జరిగిందికూడా అదే. మొదటిరోజు సత్యం నర్సుతో మాట్లాడి ప్రెస్సుకు తిరిగివచ్చి, పని చెయ్యదలచని వాళ్ళు దరినీ బయటికి వెళ్ళిపొమ్మనీ, లేకపోతే పోలీసుల్ని పిలుస్తానని అన్నాడు. కొందరు నవ్వారు. కొందరు పోలీసుల్ని పిలవమన్నారు. వెంకటాద్రి అనేవాడు మాత్రం ఉగ్రుడైపోయి సత్యం మీదికి పులిలా వచ్చిపడ్డాడు. రామస్వామి, "ఒరే, ఊరుకో!" అనేసరికి వెంకటాద్రి పిల్లిలా అయిపోయి సత్యాన్ని వదిలేశాడు.

రామస్వామిని ఆ ప్రెస్సులో వాళ్ళంతా దేవుడల్లే చూస్తారు. వాళ్ళందరినీ అతను ఎలా సమ్మోహింపజేశాడో సత్యానికైతే తెలీదుగాని, సత్యానిక్కూడా అతనంటే చాలా గౌరవం. ఎందుచేతనంటే అతను ఫస్ట్‌క్లాస్ పనివాడు. సంస్కృతిగల వాళ్ళమధ్య అసాధారణ శక్తిగల కవులకూ, గాయకులకూ, కళాకారులకూ ఎలాటి గౌరవం వుంటుందో, శ్రామిక రంగంలో ప్రజ్ఞావంతుడికి అలాటి గౌరవం ఉంటుంది. ఇంతకాలంగా ప్రెస్సులోపడి కొట్టుకుంటూండడంచేత సత్యానికి రామస్వామివంటివాణ్ణి గౌరవంగా చూసే శక్తి లభించింది. అదీగాక రామస్వామి చిల్లర స్పర్థలను ఒక్క మాటతో పరిష్కరించగలిగేవాడు. అతను జాస్తిగా మాట్లాడేవాడుకాడు. మాట్లాడినా మాటకు బరువుండేది... అన్నివిధాలా సీతప్పకు విరుద్ధం.

సత్యాన్ని వెంకటాద్రి చంపకుండా వదిలేసినాక రామస్వామి, "అతని మీదెందుకు చెయ్యిచేసుకుంటావు? అతను యజమాని కుక్క—అందులోనూ పిచ్చికుక్క! ఇతనూ కార్మికుడే—కాని మనకంటెకూడా హీనస్థితిలో వున్నాడు. మనం అతన్ని చూసి జాలిపడాలి" అన్నాడు.

తాను యెంతో గౌరవంగాచూసే రామస్వామి తనని ఫెడీమని ఇంతమాట అనేసరికి సత్యం కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతనన్నమాటలు గింగురుమని చెవుల్లో మోగుతున్నాయి. ఆ మాటల్లో ద్వేషం ఏమీలేదు. ఆలోచించగా ఆలోచించగా అతనన్నది నిజమేనన్న భావం సత్యం తల్లో మొలకెత్తింది. త్వరలోనే అది వేళ్ళు తన్నింది. రెండు రాత్రులూ, రెండు పగళ్లూ సత్యం తనస్థితిని సింహావలోకనం చేసుకున్నాడు. నర్సు వ్యాపార పద్ధతులను విమర్శించుకున్నాడు. తాను నర్సుపక్షం కావటం అసంభవ మనిపించింది. అతను తిన్నగా భద్రాచలం దగ్గిరికివచ్చి తనలో కొత్తగా కలిగిన భావాలను ఆయనతో చెప్పుకున్నాడు. భద్రాచలం వాటిని సమర్థించటమే గాక గట్టిగా బలపరిచాడు. సత్యం తన జన్మలో యెన్నడూ ఎరగని ఒక ఆనందం మొట్టమొదటసారిగా పొందాడు. వాడుకూడా ఒక మనిషి అయాడింత కాలానికి!

తరవాత సీతప్పను పిలిచారు. సీతప్ప అంతా విని బేజారైపోయాడు. యింతకాలంవూ ఋషిలాగే ఉంటూ,

ఆదర్శప్రాయంగా జీవితం వెళ్ళమారుస్తున్న కొడుకు నరకంలో అమగెట్టేశాడు—మరేమిటి?

"హారే, నువ్వు కంగారు పడకు. ఇప్పటికైనా మించిపోయిం దేమీలేదు. మీ బావమరిత్తో పోట్లాటగానీ వేసుకో లేదుగదా? మరిహనేం? నే జెప్పేది కాస్త వింటివట్టాయినా, అభిప్రాయాలన్నీ మార్చేసుకుంటావు. నీ అజ్ఞానం అలా విడిపోయూరుకుంటుం దేవి టనుకున్నా వేమిటోను!" అని ఆయన ఆరంభించాడో లేదో భద్రాచలం, "మీరిక కిందికి వెళ్ళిపోండి ! ఈ సంగతి తరవాత మాట్లాడుకుందాం" అన్నాడు.

ఇది జరిగిన మర్నాడే సత్యం, "ఇదుగోనమ్మా" అని తల్లి చేతికిచ్చాడు.

"ఏవిట్రాయివి?" అన్న దావిడ.

"నీకూ, నాన్నకూ టికెట్లు. మీ రివాళ పట్నం వెళ్ళిపోతున్నారు" అన్నాడు సత్యం...

రైల్లో సీతప్ప ఏడిచేశాడు.

"చాలా చెడ్డరోజులు. ఆ శ్రీరామచంద్రమూర్తివారి దయకు తప్పినవాణ్నయిపోయాను. ఒక్కగా నొక్క కొడుకు కార్మికుల్లో కలిసిపోయాడు. ప్రాణగండానా, ధన గండానా మనవరాలు పుట్టింది. ఇహ జల ప్రళయంలో మునిగి సర్వ నాశనమై పోవడమే తరవాయి. ఆ నవగ్రహ కూటం వెళ్ళి పోకముందే మన గర్భవాసాన పుట్టినవాడు మనకి జలప్రళయానికి టికెట్టుకొని యిచ్చాడు—"

ఇంక మాట పెగలక సీతప్ప బావురుమన్నాడు.

## 17

ఇంటికి వస్తూనే సీతప్ప పిడుగులాటి వార్త విన్నాడు—కాదు, చదివాడు. తలుపుకింది సందునుంచి లోపలికి తోసిన షావు ఆఫీసువాళ్ళు రాసిన ఉత్తరం. ఉత్తరంకూడా కాదు. సర్క్యులర్ లాటిది. మీరు పెట్టిన శెలవు అసంగతమైనది గనకా, మీ శెలవువల్ల ఆఫీసుపని చెడిపోయి తీరని నష్టం కలుగుతుందిగనకా, ఈ సర్క్యులర్ అందిన వారం రోజుల లోగా డ్యూటీలో జాయిన్ అయిపోవడమో, జాయిన్ కాలేనందుకు సవ్యమైన కారణాలు నిరూపించుకోవడమో చేస్తే తప్ప మిమ్మల్ని బర్తరఫ్ చేసినట్టు భావించవలసిందీ అని ఆసర్క్యులర్‌లో ఉంది. కింది సంతకం యజమానిది కాదు, కొత్త సంతకం. ఎప్పుడూ సీతప్ప ఆ సంతకం చూళ్ళేదు.

ఇన్నాళ్ళకి మళ్ళీ గడపలో అడుగెట్టిన మనిషి ఇల్లు సద్దుకునే పని చూడక ఏదో కాయితం పట్టుకుని కళ్ళు పెద్దవి చేసి చూస్తూండటం గమనించి రావమ్మ, "ఏమిటండీ అదీ?" అని అడిగింది.

"అసంభవం! ఇందులో ఏదో మోసంవుంది!" అన్నాడు సీతప్ప హీనస్వరంతో.

"మోసవా? ఏం మోసం?" అన్నది రావమ్మ.

"నీకు తెలీదూరుకో, ఎవరో వెటకారానికి చేసుంటా రీ పని!"

"ఏ పని ?"

"ఒకసారి మంజూరైన సెలవు రద్దుగావడవనేది నా యిన్నేళ్ళ అనుభవంలోనూ ఎన్నడూ యెరగ!"

"మీరలాగే అంటారు. కాకపోయినా మీరాపాటి తెలుసుకోలేరా యావన్నానా?" అన్నది రావమ్మ అయోమయంగా.

"ఏం భయంలేదు. నువ్వు ధైర్యంగా ఉండు. గోవిందరావుగారింటికెళ్ళి దీని వైనమంతా క్షణంలో తేల్చుకుచక్కా వస్తా," అంటూ సీతప్ప, చొక్కా విప్పేసిన సంగతికూడా మరచిపోయి బయలుదేరాడు.

"ఆ గోవిందరావుకూడా సెలవెట్టాడనరూ?" అన్నది రావమ్మ.

"అతని సెలవు రద్దయే వుంటుంది!"

"మన సెలవు రద్దుకాలేదుగదా కొంపతీసి ?"

"ఇంతిసేపాయె నేజెబుతున్నదేవిటి ? సెలవు రద్దు కానడ వేవిటి? ఏకంగా ఉద్యోగానికే ప్రమాద మొచ్చి కూచుంటేను ఇదే తేదీన రాశారూ? మరిహనేం? వారవేవిటి రెండు వారాలు కూడా కావొస్తోంది."

"వెలితే వెళ్ళారుగాని, చొక్కా అదీ వేసుకు మరీ వెళ్ళండి" అన్నది రావమ్మ.

"అవునే అన్నట్టు నా తెలివి తెల్లారిపోనూ..."

గోవిందరావుకు సర్క్యులరు సకాలంలోనే అందింది. అతను డ్యూటీలో జాయినవనూ అయాడు.

"మరి ఈ సంతక మెవరిదీ ?"

"మన కొత్త బాస్‌ది. పెద్దబాస్ గారబ్బాయి."

"అలా చెప్పూ! అందికే నేను సంతకం పోల్చలేకపోయాను. ఆఫీసు వైఖరంతా మారిపోయిందా ?"

"పూర్తిగా. ఇప్పుడంతా స్పీడ్. ఎక్కడా నిద్ర మత్తన్నదిలేదు. ఏదో వంక పెట్టి ముసలాళ్ళందర్నీ లాగవతల పారేస్తున్నారు."

సీతప్పకింకో అనుమానం వచ్చింది. "నే నింటికి వచ్చాను గనక సర్క్యులల్ చూసుకున్నాగాని, సెలవు ముగిసిందాకా రాకపోతే దానిఊసే తెలీకపోనే. నీకు సర్క్యులర్ సకాలంలో ఎలాగందిందబ్బా? ఎటూ వెళ్ళలేదా ఏవిటి?" అన్నాడు సీతప్ప.

"వెళ్ళకేం ? అయితే ఎడ్రసిచ్చి మరీవెళ్లా. అదో రూ లేడిచిందిగా ? సర్క్యులరందగానే పారిపోయొచ్చా— ప్రళయం సంగతి దేవుడెరుగునని, ఎంత ప్రళయమైతే మటుకు ఉద్యోగంకంటేఎక్కువా"? అన్నాడు గోవిందరావు.

ఇందుకు సీతప్ప ఒప్పుకోలేదు. ప్రళయానికీ ఉద్యోగానికీ సాపత్యం వేవిటి ? గ్రహాలు_అందులోనున్నూ నవ గ్రహాలు_తెచ్చిపెట్టే మహాభయంకరమైనటువంటి ప్రళయ వెక్కడ? ముష్టి మనుషులిచ్చే ఉద్యోగవెక్కడ ? తనను ఆఫీసువాళ్ళు ఉద్యోగంలోనుంచి తీసెయ్యడవేగనక జరిగినా ప్రళయం రావడమూనున్నూ యీ ఆఫీసూ, దాని కొత్త బాసూ, పాతబాసూ, వాళ్ళ ఇళ్ళూ, వాకిళ్లూ, పిల్లా, జెల్లా సమస్తమూ గంగపాలు కావడమూ నున్నూ తప్ప విడిచి మరోహాటి జరుగుతుందనుకుంటున్నారు గాబోసు ! ఆ శ్రీ రామచంద్రమూర్తి ఇలాటి అన్యాయాల్ని, ఇంతలేసి ద్రోహుల్ని సహించి ఊరుకుంటాడా ?

అయితే సీతప్ప యీ మాటలేవీ గోవిందరావుతో అన్లేదు. అతనినోట నువ్వుగింజనాన్దు, యజమానుల్తోటే అనెయ్యగల్డు. అప్పుడు వాళ్ళు తగు జాగ్రత్తపడి ప్రళయం నుంచీ తప్పించుకు పారిపోగల్రు.

పైకిమాత్రం, "ప్రళయవేఁవొచ్చే మాటుంటే ఇంకా ఈ ఉద్యోగాలూ, ఆఫీసులూ నిలుస్తాయా ఏవిటి? అబ్బో! మళ్ళీ పునః సృష్టి జరగవలసిందేనూ!" అన్నాడు సీతప్ప.

"పునః సృష్టి మాట దేవుడెరుగు. నేనదేవిటంటే, జల ప్రళయంలో చస్తే పదిమందితో చావు, పెళ్ళితో సమానం. ఉద్యోగంపోయి చచ్చేచావు ఒంటరిచావే! అది చావుతోనే సమానం,"

"నీకుచూడగా ప్రళయభయం ఏవీ లేకుండా పోయి నట్టుందే?" అన్నాడు సీతప్ప.

"ఏవోఁమరి చాలామంది ప్రళయం రాదు పొమ్మంటు న్నారు. చాలామంది అష్టగ్రహకూటం శుభవనికూడా అంటున్నారు మన ఆఫీసుమాత్రం, జల ప్రళయవొచ్చేది, అగ్ని ప్రళయ వొచ్చేది, చచ్చినట్టు పనిచేసి తీరుతుందిట"

ఈ మాట వినగానే సీతప్ప కింకోభయం పట్టుకుంది. జలప్రళయంలో సర్వనాశనమైపోయే గీత ఉండి ఆఫీసువాళ్లు తనని నిజంగా ఉద్యోగంలోంచి తీసేస్తారేవోనని! గోవిందరా వన్నట్టు జలప్రళయం రావడంకంటెకూడానున్నా ఉద్యోగం పోవడవే భయంకరవేఁవో! జలప్రళయం తప్పించుకుని ఏ తిరువణ్ణామలే అయినా పారిపోవచ్చు.ఉద్యోగంపోవడమంటూ వస్తే అదిపారిపోతే తప్పేదికాదే! ఏది దారి?

"రేపలా ఆఫీసుకొచ్చి సంగతి సందర్భాలన్నీ చెప్పు కుంటాను. నన్నొకంతట తీసెయ్యరు, నాకు తెలుసునన్లే. ఆఫీసుతోటి పుట్టినవాణ్ణికదూ?" అన్నాడు సీతప్ప గోవింద రావుకు ధైర్యం ఇస్తూ.

"అలాటి వారందరినీ లాగేస్తున్నారంటే, బాబూ! ఆఫీసుకు కొత్తరకం కావాలిట! యువకరక్తం!" అన్నాడు గోవిందరావు కొంచెమైనా ధైర్యం తెచ్చుకోకుండా.

"కొత్తబాస్ చాలా స్ట్రిక్టా యేం?"

"స్ట్రిక్టేమీ లేదు. ఆఫీసుకు కోతులసర్కస్ అని ఒకపేరూ, స్టోనేజికాన్వాయ్ అని మరోపేరూ, ఓపియం హోంపని ఒకపేరూ పెట్టాడు. పెద్దతలకాయలందరికీ స్లాత్ నంబరు వన్, స్లాత్ నంబర్ టూ—ఇలా నామకరణాలు చేశాడు. ఆ పరిభాష అతనితోబాటు వచ్చిన కుర్రాళ్ళకి మాత్రమే తెలుసు. వాళ్ళు నవ్వుకుంటారు.

"సరే, నే వస్తా. మైలుదిగిన బట్టలింకా విడవనైనా లేదు." అంటూ సీతప్ప యింటికి వచ్చేశాడు. ఆరాత్రి ఆయనకు పీడకల వచ్చింది. ఒక రాక్షసి ముందు కుర్రాళ్ళం దరినీ బలిఇచ్చి రక్తం గంగాళంలో పోస్తున్నారుట. ఆ రాక్షసి తన ఆఫీసుట.

మర్నాడు శుభవార్త తెలియనే తెలిసింది. ఆయన ఉద్యోగం పోయింది. ఎకౌంటు సెటిలయిపోయింది. డబ్బు తీసుకుని క్షేమూనవెళ్ళి లాభాన రమ్మన్నాడు.

సీతప్ప ఒకంతట అపజయం ఒప్పలేదు. కొత్త యజ

మాని నవ్వుతూ మాట్లాడటం ఆయనకి మరింత బలా న్నిచ్చింది.

"నేను సర్క్యులర్ అందగానేనున్నా మ్యాటీలో జాయినైపోలేదావటాని తమరు నన్ను ఉద్యోగంలోంచి తీసి పారేశారు. నాకు తెలుసు. తమకు కోపం రావడంకూడా నున్నా నబువేతప్ప విడిచి మరొటీ మరోటీకాదు. అయితే నాసంగతికూడా తమరు కొంచెం వినాలి. నేనేమోనున్నా అవతల నామనవరాలి బారసాల నావకరణవూ శాంతీగట్రా వచ్చిపడి వూరెళ్లాను. తీరావెళ్లాక అక్కడ కొన్ని వ్యవహారాలూ, చిక్కులూ, పేచీలూ, అవాంతరాలూ వచ్చి పడ్డాయి అవన్నీ వదలకుండానే తిరిగి వచ్చేశా నేవిటను కున్నా రేవిటోను! నవగ్రహకూటవని భయపడి వెళ్ళినవాణ్ణే అయితే ఆ బెపదతీరకుండానే తిరిగివచ్చేద్దునా? ఈ ఒక్క సంకతి తమరాలోచించి రట్టయినా నేను మరేవీ కోరను! నవగ్రహకూటానికి జడిసి పారిపోయిన వాళ్ళతో నన్నా జమకట్టడం సబువుకాదనే నేను తమకి మనవిచేసేది."

కొత్తబాసు నవ్వి, "నవగ్రహకూటం మాటెక్కడొచ్చిందయ్యా, శాబూ? ఆఫీసులో చాలామార్పులు చేశాం. కొంతమంది పాతవాళ్ళని పంపేశాం. శలవు పెట్టటానికీ దీనికీ సంబంధంలేదు, కాకపోయినా జలప్రళయం గురించి ఆఫీసంతటినీ అదరగొట్టింది మీరేటగదూ? నాతో పనిమందిబాకా చెప్పారు. ఈకా స్తకోసం అబద్ధ వాడతా రెందుకూ?" అన్నాడు.

"మరిహానేం ? మీకా అనుమానం ఉండబట్టే నన్ను తీసేస్తావంటున్నారు. ఆ అనుమానం రహితమైతేనేగాని మీరు మీ నిర్ణయం మార్చుకోరు. అంచేతే నే నింతగా చెబుతూంట," అన్నాడు సీతప్ప.

కొత్తబాసు మరింత విరగబడినవ్వి. "నిన్ను తీసేస్తాననటం లేదయ్యా, బాబూ. ఎప్పుడో తీసేశాం. దానికీ జలప్రళయానికీ సంబంధ లేదంటినిగా," అన్నాడు.

"నా విలవ నే చెప్పకోకూడదు. అది మీనాన్నగారికి బాగా తెలుసు. మీ వ్యాపారం ప్రారంభించిన నాటినుంచీ నే నున్నాను. పాత లెడ్జెరు తీసి చూడండి. నా దస్తూరీయే కనిపిస్తుంది. నావల్ల ఎప్పుడైనా కించిత్తు పొరబాటేనైనా వచ్చుంటే చెప్పొచ్చు కొట్టండి, పడతాను. కాని ఇలా అకారణంగా——"

చిన్నబాస్ అకస్మాత్తుగా సీతప్ప మాటలు వినడం మానేసి, టెలిఫోనెత్తి ఏదో నంబరు డయల్ చేస్తూ, వెళ్ళమని సీతప్పకు చేత్తో సంజ్ఞ చేశాడు.

తనకింత ఘోరమైన అన్యాయం చేసిన చిన్నబాస్ నెత్తిన ఏ పిడుగో పడకపోవడం కూడా ఆ శ్రీరామచంద్రమూర్తివారి మాయే అయుండాలనుకుంటూ సీతప్ప లేచి యివతలకొచ్చాడు. ఉద్యోగం పోయిందన్న దడ ఆఫీసువారిచ్చిన ఆరునెల్ల జీతంతో కొంచెంగా – బహు కొంచెంగా – ఉపశమించింది.

# 18

"ఏవండీ, కోడంశాకం కోయిల దగ్గర అహోరాత్రాలు మంత్రోచ్చాటన జరుగుతోందిట. డబ్బు కడితే మన పేరు చెప్పి సహస్రనామ పూజ చేస్తారుట. అవేవిటి చెప్మా, సినిమాల్లో లాగా గట్టిగా అందరికీ వినిపించేవి ఏవో పెట్టి భూమ్యాకాశాలు మంత్రాలతో నింపేస్తున్నారుట. కలియుగ వైకుంఠ వేట," అన్నది రావమ్మ.

"మంత్రోచ్చాటన అహోరాత్రాలు అవిరామంగా జరుగుతోంది గాదా? జరగనీ. అది నిలిచిపోయేట్టుంటే మనంకూడా డబ్బుగట్టి చదివింతాం. ఉత్తినే యెందుకూ? యింకా ప్రళయానికి మూడ్రోజులే ఉంటా! మనం రవణాశ్రం పోతే మంచిదేవో ననిపిస్తోంది. కాని ఆ నాయుడు ఎల్లుండి యింటర్వ్యూ ఏర్పాటు చేశాడు. ప్రళయం సిగ్గో సిరి, యింటర్వ్యూకు ఉండి పోదావాఅంటే ఉద్యోగం ఖాయంగా దొరుకుతుందని గూఢీ లేదాయిరె! ముందు నుయ్యా, వెనగ్గొయ్యా అయూరుకుంది!" అన్నాడు సీతప్ప.

"మళ్ళీ యింకో ఉద్యోగం చూస్తున్నారుగదా? చెప్పరేం?" అన్నది రావమ్మ పరమానందంతో.

"చెబుతున్నాను గానా? ధైర్యంగా ప్రళయా న్నెదిరించి ఉండిపోవడవా, ఆ రామచంద్రమూర్తివారి మీదే

భారం వేసి రవణాశ్రమాని కెళ్ళిపోవడమా. ఏదీ తేల్చుకోకుండా ఉన్నా."

"ప్రళయం రాదు అంతా ఉత్తదేనని చాలామంది అంటున్నారండీ. మరి మూడ్రోజుల్లో సముద్రం పొంగుతుందీ అంటే ఈ సరికి కాలమేఘాలన్నీ కమ్మేసుకోవద్దూ ఆవటాంటున్నది శేషంపిన్ని."

"అదీ ఒకవిధంగా సబబైనమాటేనూ, సుతరాయ్రా కొట్టి పారేడానికి వీల్లేదు. కాని నిన్నకూడా రవణాశ్రంనుంచి కరపత్రాలొచ్చాయి. బతకదల్చినవాళ్ళకి ఆఖరు ఛాన్సు అలాగని. మన మంచికేగదూ బోలెడంత డబ్బు తగలేసి కరపత్రాలేస్తున్నారూ ? మరోటీ మరోటీ అయితే తోసి పారేద్దుంగాని ఇటొచ్చి నవగ్రహాలూనూ, అటొచ్చి రవణాశ్రవున్నూ అయింది గదామరి ! ఇంకో వారం దాటించి ఇంటర్వ్యూ పెట్టించవయ్యా, బాబూ, అంటే నాయుడు విన్నాడు కాడు. ఇదంతా కూడా నన్ను ఆ శ్రీరామచంద్రమూర్తివారు పరీక్షించడవేనూ ! వీడెటుమొగ్గుతాడు? ప్రాణంమీదెక్కువతీపా, వీడికి ఉద్యోగం మీదెక్కువ మోజా ? ఈ సంగతి తేల్చుకుందుకే నాకీ పరీక్ష పెట్టాడు! నా దేవుంది ? మానవమాత్రుణ్ణి. ఆ శ్రీరామచంద్రమూర్తివారు ఈ క్షణం నన్ను 'ఒరే, నువు తిన్నగా రవణాశ్రం వెళ్ళిపోయి ప్రాణం దక్కించుకో,' అంటే ఉద్యోగం వూసెత్తక వెళ్ళిపోతాను. లేదూ ? 'సి ప్రాణానికి నా

ప్రాణం వదిలేస్తాను. ఎక్కడికీ వెళ్లక ఉద్యోగం సంపాదించుకో,' అంటే ప్రళయానికి ఏమాత్రమూ లక్ష్యపెట్టక ధైర్యంతో ఉండిపోతాను," అన్నాడు సీతప్ప.

కాని తన భక్తుణ్ణి పరీక్షించ దలుచుకున్న శ్రీరామచంద్రమూర్తివారు సీతప్ప ఇచ్చిన రెండు సూచనల్లో ఏ ఒకాటీ ఆమోదించక మౌనం వహించాడు. అందుచేత సీతప్ప రావమ్మతో సహా అష్టగ్రహకూటం ఇంకా ముప్పయ్యారు గంటలకనగా రవణాశ్రమం బస్సెక్కేశాడు.

అక్కడ వాళ్లకి ఆట్టే సౌకర్యాలేవీ కలగలేదు. కాని "ఈసరికి త్రిప్లికేను మునిగుంటుంది. ఈ పాటికి మౌంటురోడ్డుండదు. ఈ సరికి స్టూడియోలన్నీ నీటి అడుగున ఉంటాయి," అని సంతృప్తి పడడంతో ఆ పుణ్య దంపతులకు ఏ కష్టాలూ తెలియలేదు. కాని ఈ తృప్తిఅయినా దక్కకుండా వారికి త్వరలోనే జలప్రళయం జరగలేదన్న వార్త తెలిసింది. ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం నిక్షేపంగా వార్తలూ గట్రా ప్రసారం చేస్తూనే ఉంది. వెయ్యి నిలువల నీటి అడుగున మునిగి ఉంటే ఇది సాధ్యపడునా ?

"ఎంత మోసం ! ఎంత వంచన !" అన్నది రావమ్మ.

"అలా అనకు. ఎన్ని యాగాలు జరిగాయి ! ఎంత వేదపఠనం ! ఎంత గ్రహశాంతి! అంతా ఊరికే పోతుందా?

జలప్రళయం రాకపోవడాన్నిబట్టే ఈ యోగాలూ, భజన్లూ వట్టివేనోవని తెలిసిపోతోంది," అన్నాడు సీతప్ప.

"అలా అయితే మనవెందుకు పారిపోయొచ్చినట్టూ? హాయిగా పట్నంలోనేఉండి ఉద్యోగ ప్రయత్నం చేసుకునే పనిగా?"

భార్య అన్న ఈ మాటకు సీతప్ప నిరుత్తరుడయాడు.

యింటికి తిరిగివస్తూనే సీతప్ప నాయుణ్ణి చూడ బోయాడు.

"నే నెంత చెప్పినా ఆ రోజుకు ఊళ్లో లేకుండా ఎందుకు పారిపోయావయ్యా, వెర్రిబ్రాహ్మడా? ఉద్యోగం ఇంకోరికి ఖాయమయింది. సీశోబాటు ఊస్టయినవాడే-మీ నాగభూషణ," అన్నాడు నాయుడు.

సీతప్ప లోపలి పొరల్లో సన్నగా దడ ఆరంభ మయింది.

"వెళ్లానంటే మరి అందర్లానే నేనూ ప్రళయ వొస్తుందావటానుకున్నా గాని రాదని నాకేం తెలుసూ? లోకవంతా కోడై కూస్తోంటే ఎలా నమ్మకండా వుండడం? అయ్యా, ఇది ద్రోహబుద్ధితో చేసిన పనికాదు; ఉద్యోగంపట్ల నిర్లక్ష్యమున్నది మొదలేకాదు; శరీరం వాద్యవన్నారు గనక నున్నూ, నవగ్రహకూటం దాటి వెళ్ళిపోయిందాకా తమరు ఎవరినీ వేస్కోరావటానుకునిన్నీ అలా రవణాశ్రమంకేసి

వెళ్ళి రావడం జరిగిందని చెబితే నా కేసు రీకన్సిడరు చేస్తా రేమో?" అన్నాడు.

నాయుడు సీతప్పకేసి తెల్లబోయి చూస్తూ, "నాగభూషణాని కిచ్చేసిన ఉద్యోగం లాగేసుకుని నీ కివ్వరా అనా అడుగుతున్నావు?" అన్నాడు.

సీతప్ప దడ హెచ్చిపోయింది.

"అబ్బే, అదేమ్మాట? ఒకరి కీడ్డేం చేరాదు. న్యాయంగా నాకు రావలసినటువంటి ఉద్యోగమేనన్నా ఆ అబద్ధాలకోరు నాగభూషణానికి అన్యాక్రాంతం అయితే కూడానన్నా అతడి ఉద్యోగం పోవాలని మనం కోరే కూడదు. ఈ రోజుల్లో చేసుకునే ఉద్యోగం పోవడమంటే మాటలా? ఎంత యిది! పగవాళ్ళక్కూడా జరగ్గూడదంతే! మన మెలా కోరుకోవాలంటే ఆ చాడీకోరు నాగభూషణానికీ ఉద్యోగం రావాలి, నాకూ రావాలి! అలా ఆలోచించాలి మనం."

"సరే, నీ ఆలోచనే సహం ఫలించింది. నాగభూషణాని కుద్యోగమయింది. ఇక నీ సంగతి చూసుకో మరి," అన్నాడు నాయుడు.

## 19

సత్యం తల్లికి ఉత్తరం రాశాడు.

"నాన్నకు ఉద్యోగంపోయిందని తెలిసింది. శేషూ, వాడి భార్యా ఇక్కడి కేదో పనిమీద వచ్చారు. ఆయన ఉద్యోగం పోగొట్టుకున్న పద్ధతిచూస్తే ఆయనకు ప్రపంచ జ్ఞానం తక్కువని తెలుస్తోంది. ఆయనకు లేకపోవడమేగాక నాకూ, సోమక్కకూడా ప్రపంచజ్ఞానం లేకుండా చేశాడు. అందుకే ఆయనంత లౌకికుడు లేడనీ, అంత జ్ఞాని లేడనీ అనుకున్నాం. పాతికేళ్ళు కరుడుగట్టిపోయిన నా బుర్ర ఇప్పుడిప్పుడే కదలబారుతున్నది. లోకాన్ని కొత్త కళ్ళతో చూస్తున్నాను. శేషునుగురించి ఎంత తేలిక భావాలుండేవి నాకు! వాడికున్న తెలివీ, నిబ్బరమూ ఎవరికున్నాయి? బావగా రెంత ఓర్పరి. ఎంత తెలివిగలవాడు! అక్క కాస్త తెలివితేట ఉపయోగిస్తే ఆయనతో ఎంత సుఖపడిఉండును! అక్కకి కొంచెం కొంచెమే బోధిస్తున్నాను. అన్నిటికీ అవు నవు నంటుందేగాని నా మాటలు అర్థంచేసుకోంటోం దనుకోను. నీవు స్వతహాగా నాన్నకంటె హెచ్చుఆలోచనా పరురాలవనీ, నే చెప్పే విషయాలు కొంతలో కొంత అర్థం చేసుకోగలవనీ అనుకుని నీ కీ ఉత్తరం రాస్తు న్నాను.

"ఇప్పుడు నేను అక్కడగ్గిరే ఉంటున్నాను. బావగా రుండమన్నారు. ఆయన నాకు ఉద్యోగం ఇప్పిస్తున్నారు. గుడ్డిదాన్ని పిల్లతో సహా వచ్చేయమంటే రానన్నది. నీ యిష్టం వచ్చినట్టు చావు అని వచ్చేస్తుంటే నర్సు నాతో ఏదో వాదన వేసుకున్నాడు. వినీ వినీ వాణ్ణి గూబ అదిరేలా కొట్టి వచ్చేశాను. వాడు వట్టి పిరికిపంద! వాణ్ణి కొట్టి నందుకు నాలో కలిగిన ఆనంద మేమని చెప్పను! నా జోలికొచ్చినప్పుడల్లా తంతాను. అనవసరంగా కలగ జేసుకునయినా వాణ్ణి తన్నాలని నాకు మహా తీటగాఉంది.

"నాన్న చాలా డబ్బు కూడబెట్టాడు. నాకు తెలుసు. ఇంకా ఆయనకు ఉద్యోగమెందుకు? పట్నంలో నివాస మెందుకు? మన ప్రాంతాలకి వచ్చేసి రామకోటి రాసుకో మను. నా పూచీ ఆయన ఏనాడో వదిలించేసుకున్నాడు. కాని మీ రిద్దరూ ఉన్నంతకాలమూ మీకు అన్న వస్త్రాలకు లోటు జరక్కుండా నేను చూడటానికి యత్నిస్తాను.

"గుడ్డిదానికి ఈ నెలాఖరుదాకా టైమిచ్చాను. ఈ లోపల నా దగ్గిరికి వచ్చెయ్యకపోతే ఎవతెనన్నా తెచ్చిపెట్టు కుంటానని చెప్పాను. నిజంగానే పెట్టుకుంటాను..."

ఈ ఉత్తరచూసి సీతప్ప ఒక్కటే ముక్క అన్నాడు. "నే నమ్మ!"

మనిషికి కనువిప్పు కావటమనేది చాలా చిత్రంగా ఉంటుంది. అది మనిషిలో ఎలా జరిగేదీ చెప్పటం కష్టం. కొందరిలో అది అమిత నింపాదిగా జరుగుతుంది. మనిషి

మారుతున్నట్టు పైవాళ్లకు వచ్చినా తెలీదు. పైకి తేడా కనిపించేసరికి మనిషి పూర్తిగా మారే ఉంటాడు. మరి కొందరు మొదటి క్షణంనుంచీ పైకి కనిపించేలా మారు తారు. కాని ఆ మార్పు పూర్తికావటానికి చాలాకాలం పడుతుంది. కొందరు మారేటప్పుడు చాలా మానసిక బాధలకు లోనవుతారు. కొందరు చాలా ఉత్సాహంతో మారిపోతారు.

సత్యంలో కలిగినమార్పు ఆకస్మికమైనదీ, ఉత్సాహ పూరితమైనదీనూ, సోమిదేవిలోకూడా మార్పు వచ్చింది. ముఖ్యంగా తన తండ్రి ప్రళయానికి బెదిరివచ్చిన పైనమూ, వెళ్ళినవైనమూ, ఉద్యోగం పోగొట్టుకోవడమూ, వియ్యాల వారింట అవమానం పాలుకావడమూ, తమ్ముడి తిరుగు బాటూ, తన భర్త వాణ్ణి ఆదుకోవడమూ – ఇవన్ని ఊరికే పోలేదు. కాని పైకి ఆమెలో ఏమార్పూ తెలియరాలేదు. గర్భంలో జరిగే గొడవ కడుపుతోన్నదానికే తెలిసినట్టు, తన మనసులోజరిగే మార్పులవల్ల ఏ బాధలైతే కలిగాయో అవన్నీ ఆమె మౌనంగా భరించింది

“ఎంత చెడ్డా అది నీ భార్య. అందులోనూ పిల్లతల్లి. దాన్ని నువ్వలా విడిచేసి రావడం మంచిది కాదొరే!” అని తమ్ముణ్ణి సోమిదేవి మందలించింది. కాని తమ్ముడిలో ఆక స్మికంగా కలిగిన ధైర్య సాహసాలకు ఆమె లో లోపల ఆశ్చర్యపడక పోలేదు మెచ్చుకోకనూ పోలేదు. అలా మెచ్చుకోడం తప్పేమోనని కూడా భయపడింది.

అయితేనేం? చలి దేశంలో పేరుకున్న నదులు కరగడం ఆరంభిస్తే బయలుదేరేక ఇంక మరి ఆగదు. అంత కంతకీ అది వేగం హెచ్చుతుంది. ఎన్నేళ్ళుగానో సోమిదేవి కడుపులో పెట్టుకుని ఉన్న అక్కసంతా అగ్నిపర్వతం పగిలి శిలాద్రవం వచ్చినట్టుగా పైకి తన్నేసింది. సత్తెం అత్తవారు తనని మొదట్లో ఎలా ఉపయోగించుకుని తరవాత ఎలా చూశారు? వాళ్ళతో వియ్యంవే ఎంతో గొప్ప అనుకున్న దానికి మామూలు లాంఛనాలేనా జరిపారుకారు – వీళ్ళ బ్రహ్మసమాజం బొగ్గులవా! అల్లుణ్ణి ఇంటికుక్కను చేసేసుకుని అల్లుడివైపు వాళ్ళందరినీ గడ్డిపరకలకంటె హీనంగా చూశారుగద! ఎంత హీనంగా బతికే వాళ్ళైనా రాకరాక ఇంటికొచ్చిన వియ్యాలవారి నిలాగా చూస్తారు?

ఒక్కొటీ తలుపుకొచ్చేకొద్దీ సోమిదేవి అగ్గయిపోయింది. అందుచేత ఒకనాడు సత్యం అత్తగారు అల్లుడి మీద సాడ్డేసి పోవడాని కొచ్చేసరికి, సోమిదేవి పూనకం వచ్చినదానిలాగా రెచ్చిపోయి కడిగేసి వదిలిపెట్టింది. పడవలసినమాటలన్నీ పడి ఆవిడ అలా వెళ్ళిందో లేదో సోమిదేవి అత్యాశ్చర్యం కలిగించే సంఘటన ఒకటి జరిగింది. భద్రాచలం మెట్లుదిగి, బయటికి వెళ్ళిపోకుండా లోపలికొచ్చాడు.

ఆయన తనకేసి తేరిపార జూస్తున్నట్టు గ్రహించి సోమిదేవి కొయ్యబారిపోయి తలవొంచుకు నిలబడింది.

"మరేం లేదు. ఇవాళ రాత్రికి అందరివూం కలిసి భోంచేస్తే బాగుంటుం దనిపించింది. వంట – నువ్వు చేస్తావా, లేక –" అన్నాడు భద్రాచలం.

"నేనే చేస్తాను – అంతకం టేనా?" అన్నది సోమిదేవి తల యెత్తకుండానే.

ఆరాత్రి భద్రాచలమూ, పార్వతీ, సత్యమూ, చిత్తుగాడూ, సోమిదేవీ ఒకేసారి భోజనానికూర్చున్నారు. సోమి వంటను పార్వతి మెచ్చుకున్నది. ఆ తరువాత భద్రాచలం కూడా మెచ్చుకున్నాడు. అది సోమిదేవి జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన రోజు.

## 20

"ఏవి టేవిటీ? శివన్నయ్యా? ఎన్నాళ్ల కెన్నాళ్ళకు ఎప్పుడు రావడం? వదినె కులాసావేగదా? అలా మునక్కూడ కంటబడితేచాలు నువ్వు గ్యాపక వొస్తావుగదా! కాళ్ళు కడుక్కో! ఊఁ!" అని సీతప్ప అన్నగార్నిచూసి పరవళ్లు త్రొక్కాడు.

శివన్నయ్య వాలుకుర్చీలో కూచుంటూ, నేనూ మీ వదినే తిరపతి దేవుణ్ణిచూసుకుని, కాళహస్తిమీదుగా వచ్చాం. తిరపతి కొస్తూ తోవలో రాజమండ్రిలో ఒకరోజు నిలిచాం. అంతా కులాసాగానే వున్నారు. అన్నట్టు సత్తెం సికిందరాబాదు వెళుతున్నాట్టగదూ? వాడికక్కడే వుద్యోగంవయిందన్నారూ?" అని అడిగాడు.

"నాకా విషయవే తెలీదే. ఎంతన్యాయం! ఎంతన్యాయం!" అన్నాడు సీతప్ప.

శివుడు ఆశ్చర్యంతో, "అన్యాయవేవిట్రా? నిక్షేపం లాటి వుద్యోగంట; నెలకు ఏ మూడొందలో ఇస్తారుటకూడా గదూ?" అన్నాడు.

"ఇచ్చినప్పటి మాటగద! ముందు వాణ్ణి దూరం తన్ని తగిలేస్తున్నారూ! దరిదాపుల్లో ఎక్కడా లేకుండా చేసేస్తే తరవాత వాడిపాట్లు వాడే పడతాడు!" అన్నాడు సీతప్ప విచారంగా.

"ఎవరు తన్ని తగిలేస్తున్నారంటావు? ఈ ఉద్యోగం భద్రాచలవిప్పిచ్చాట్ట!"

"ఆపాటి తెలుసుకోలేవా? మహారాజులా మను గుడు పులు గుడుస్తూ ఇంతకాలవూ అత్తారింట కాలక్షేపం చేసిన వెధవ అజ్ఞానంకొద్దీ అత్తవారితోటి తగాదాపడి, పనిమాను కుని, పెళ్ళాన్నీ బిడ్డనీ వొదిలేసి. భద్రాచలంయింట దాగు న్నాడు. అత్తగారుగనక భరించారుగాని భద్రాచలవెందుకు భరిస్తాడూ? అందులోనూ పెళ్ళాన్ని వొదిలేసినవాణ్ణి ఆ పెళ్ళాంవింటికి ఎదురింటోనే పెట్టుకు భరించడం యెంత నామోషీ, ఏవిటికథ! అదలావుంచు. కండకిలేని దురదబచ్చలి కాన్నట్టుపోవిదేవినే యేలనివాడికి దాని తమ్ముడిమీద మంవ కారంవా? ఎవరునమ్ముతారు. 'ఈఅబ్బిమనింటో దేనికి? పీడ! పెందరాళే సాగనంపండి' అని భద్రాచలానికీ ఆఅమ్మాయి చెప్పుంటుంది. ౧౦కేంవుంది, రైళ్ళుమారితేగాని చేరనిచోటికి తోసేశాడు. ఇందులో ఇంకో తిరుగుడుకూడా గమనించావో లేదో, సత్తెం సంసారం శాశ్వితంగానున్నా విచ్ఛిత్తి అవ డానికేవోనున్నా యిది పసందైన పథకం. ఎంచాతంటావా?

ఎదురింట పెళ్ళాం(వుందన్నాక సత్తెం మనసు మారొచ్చు. సూదంటురాయె తప్పవిడిచి మరొకటి కాదుగదా! అందులో నుస్నూ, ఎంతచెడ్డా కుర్రాళ్ళాయిరి. సత్తాన్ని సికిందరాబాదు తోలేస్తే వాడక్కడ ఏ బూబునో మరిగి మరి పెళ్ళాం బిడ్డల మాటే తలవడు. ఇంతాలోచనా చేసి వాళ్ళపని జేస్తే నువు ధర్మరాజులాటి నిష్కల్మషుడివి గావటంచేత నుస్నూ మరోలా అనుకుని లోలోపల ఆ భద్రాచలాన్ని మెచ్చుకు నుంటావు."

సీతప్ప పూర్తి చేసిందాకా అన్నగారాయన్ని రెప్పార్చకుండా చూసి, "ఏళ్ళతో బాటు నీ తెలివి అమోఘంగా ప్రజ్వలిస్తోందోరే అయితే నువు చెప్పిందానికి ఒకటిరెండు చిన్న తబిశీళ్లున్నాయి. భద్రాచల వింట్లో ఇప్పుడంతా యేకవయూరు; అసెవరకులా రెండు పొయిల్లేవు. అంతా కలిసే భోజనాలు," అన్నాడు.

ఈ వార్తలోగల దారుణాన్ని సీతప్ప ఇట్టే పసి కట్టేశాడు.

"అంతపనీ జరిగిందీ? ఇంక సావిదేవికి ప్రవాద వేనూ! ఇది మంచికొచ్చిం దనుకుంటున్నావు గావోసు: పొరబాటు! సావిదేవికీ, చిత్తుగాడికీ ఏరాత్రో అన్నంలో ఇంత విషంగలిపి పెట్టేస్తారు. ఆ – అమ్మాయికి పిల్లా పీచూ లేదు ... వెంటనే వాళ్ళిద్దర్నీ ఏదో వంకపెట్టి తోలుకు రావాలి. లేకపోతే వాళ్ల ప్రాణాలు నిలువునా తీసేస్తారు." అన్నాడు సీతప్ప, రైలింజన్లా అయిపోతూ.

. తీసుకురాక తప్పుతుందా ఏవిటి? సావిదేవికి రెండు

నెల్లు నిండాయన్నారు. ఏ ఆరో నెలలోనో, ఏడో నెల లోనో తీసుకొద్దూగాని!" అన్నాడు శివుడు.

అన్న చెప్పింది ఒక్క ముక్కా అర్థంకాలేదు. ఆ వార్త చుట్టూ చాలాసేపు ఆలోచనల గూడు అల్లుతేనేగాని ఆ వార్తలోని దారుణం బోధపడదు! ...నిప్పులాంటి మనిషి! తపస్విని! కాలు జారడం అసంభవం! మొగుడికి తెలిస్తే యింకేవేనా వుందా? అటు భర్తకీ, ఇటు పుట్టింటివారికీ యెంత అప్రతిష్ట! యెంత...

"ఇంకో విషయంకూడా చెప్పడం మరిచానోరే. మీ కోడలుకూడా సికింద్రాబా వెళ్ళిపోతోంది, పిల్లలతో సహా! అన్ని యేర్పాట్లూ అయిపోయాయి" అంటూ శివుడు వాలుకుర్చీలోంచి లేచాడు.

"అప్పుడే వెళ్ళిపోతున్నావా?" అన్నాడు సీతప్ప. ఆ సద్బ్రాహ్మడికి అంతకంటే అనడాని కేమీ తోచలేదు.

"సత్యానికీ సావిదేవికీ ఒక చిన్న సలహా యిచ్చి మరీ వచ్చా! అదే నీకూడా యిద్దా మనుకుంటున్నా. మంచితనానికేనా కొలతలూగోళ్ళూ ఉండాలిరా! పొట్లకాయ మంచితనవూ, సొరకాయ మంచితనవూ కత్తిపీటలని చెడవి చేయిస్తారా! ఆ సీతాపతీ వాడికొడుకూ, మీ భద్రాచలం — వీళ్ళంతా చెడ్డవాళ్ళంటావా? అందర్లాంటివాళ్ళే. కాని వాళ్ళని రాక్షసుల్లా చేసిందెవరు? కాస్త ఆలోచించుకో! వస్తా!" అంటూ శివుడు కాలు సాగించాడు.

  

ఆనాడు పార్వతీదేవి ఒట్టిపిండిముద్దతో వినాయకుణ్ణి సృష్టించి నట్లు, ఒట్టి పిరికిముద్దతో సీతప్పను సృష్టించారు కుటుంబరావు గారు........

మా అత్తగారి దృష్టిలో సీతప్ప ఒక్క నాసి మాత్రమేకాదు, పిరికి సన్నాసికూడా....సీతప్పే మా అత్తగారికి ఎదురైతే....

"ఆపరా నీ శాక్యోపాఖ్యానం.... అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గిరా! అసలు నీ కొడుకు అత్తగారింట్లో అడ్డమైన చాకిరీ చేసిన సంగతి ఎవరికి తెలియదనీ! కళ్ళుమూసుకుని పాలుతాగే పిల్లివిరా సీతప్పా నువ్వు!" మా అత్తగారి ఆవేశధోరణికి సీతప్పకు ఒళ్ళంతా ఒణకడం మొదలుపెట్టింది.

"అబ్బే....! వీడు ఒట్టినాప! వీణ్ణిబాగుచెయ్యడం ఆ వెంకన్న వల్లగూడాకాదు. అసలు బ్రహ్మవీణ్ణెందుకు సృష్టించాడో నాకర్థం కాదు." అని గొణుక్కున్నారు మా అత్తగారు.

అసలు మా అత్తగార్ని, సీతప్పనూ బ్రహ్మ సృష్టిస్తేగా! బ్రహ్మ సృష్టిలో మార్పుంది. కానీ, సీతప్పా, మా అత్తగారూ మారరు. వీళ్ళిద్దర్లో మార్పుతేవడం ఆ బ్రహ్మతరం కూడాకాదు. అలాంటి మార్పులేని, మరపురాని సీతప్పపాత్రను సృష్టించిన కుటుంబరావుగారు అభినందనీయులు........

Title Printed at Venkataratna

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | AAL02C218 | Date | 01/10/2021 |
| Front Cover | NO | Back Cover | Yes |
| Blank Pages | 12, 135 | | |
| Missing Pages | NO | | |
| Prepared | K.Yameema | Scanned | Mounika |
| BOOK SIZE | H 7.1 W 4.8 | Pages | 144 |

